

# విజ్ఞప్తి

సోదర సోదరీ మణులారా !

శా॥ ప్రీతిన్, మాకిలవేల్పులౌ, గురువులౌ ♦ ప్రేమ, స్వరూపుల్
ఘనుల్ । పూతస్వాంతులు, పూజ్యులున్, వరగుణా ♦
పూర్ణుల్, కృపాసాగరుల్। నేతల్, మారమణీమణీపతిని,
వా ♦ ణీనా, యకున్ గొల్వగా ప్రీతిన్, మే మిదె గూర్చి,
నాముగనరే ♦ ప్రేమప్రసూనంబులన్॥ 1

వ. పలువిధభక్తిభావముల ♦ భాసిలు నీపదతోయజంబులన్।
గలిగిన భక్తిసౌరభము ♦ గాటపుగూర్మిగనుండు,మామనం।
బలరగ జేయుటయ్యదె, స♦మాదరమున్, మము, జూచు
టయ్యదే । సలలిత సమ్మదమ్మొదవ♦జక్కగ గాంచుడి,
మా సుపూజలన్॥ 2

పెనుగొండ
37—9—31 } శ్రీమతులు లక్ష్మీశారదలు.

శ్రీ

# పిత్రాభివందనము.



క॥ శ్రీ, లక్ష్మీనృశారదలన్
పాలిత, నిజ భర్తృవాక్య ♦ భావోన్నతలన్ ।
శ్రీలక్ష్మీనృశారదలే
లింతురుగాత, భాగ్య ♦ వైభవ మిడుచున్॥

చ॥ సరసకవి[illegible] తత్వరస ♦ సాగరపారగ భవ్యభారతీ।
గురుతర సత్కృపా కలిత ♦ కోమలభావ విశేష, శేముషీ।
భరితరసజ్ఞలార! రస ♦ బంధురకావ్యనిబంధనాదిభా।
సురరచనాచమత్కృతుల ♦ శోభిలుమీకవితావిలాసముల్॥

మ॥ పదలాలిత్యము శబ్దసౌష్ఠవము భా ♦ వస్ఫూర్తి భాసిల్ల, ఆ।
స్పదమై శైలికి, భవ్యమౌచు వెలయన్ ♦ సంగీతసాహిత్యముల్।
మృదులంబై, రసవంతమై, ల ♦ లితలక్ష్మీశారదా దివ్య, వా।
గ్విదితంబైనుతికెక్కెనౌ భళిర! "ల♦క్ష్మీనృశారదాగీతముల్"॥

చ॥ నయగుణలార ! భర్తమది ♦ నాట, "రమాపతి, శారదా
పతి"। ద్వయమునుగూర్చి, భావభరి♦తంపు సుధామధురో
క్తులొప్పు,త। ద్దయుశతకద్వయమ్ముమహి♦తప్రతిభావిభవం
బుజూపి, యొంతయు దగురీతిగూర్చితిరి ♦ ధారుణిబెద్దలు
మెచ్చునట్లుగన్॥

సీ॥ కపురంపు బలుకుల ♦ గవితాకుమారికి
నెమ్మోయి నేర్పితి ♦ రమ్మలార!
ద్వ్యర్థివాచాప్రౌఢి ♦ భాషించువైఖరి
నెమ్మోయి నేర్పితి ♦ రమ్మలార!
సూరిజనామోద ♦ సుకుమారభావమ్ము
లెమ్మోయి నేర్పితి ♦ రమ్మలార!
చిత్తతోషణములు ♦ చిన్నారిపోకడ
లెమ్మోయి నేర్పితి ♦ రమ్మలార!

తే॥ గీ॥ ధన్య యయ్యెను మీకవి ♦ తాకుమారి
ధన్యలైతిరిమీర లో! తల్లులార!
అల్ల "శ్రీరాము"కృపను వర్ధిల్లు డమ్మ
లార, సిరుల, "లక్ష్మీశార ♦ దాంబలార"॥

*పడలి,
ఋషుతాలూకా.
17—10—31

ఇట్లు,
మంచం బుచ్చిలింగప్పకవి.



# ఆశీస్సు.

సీ॥ ఆయుష్యమస్తు, మీ ♦ కైశ్వర్యమస్తు, సం
పత్ప్రాప్తిరస్తు, సౌ ♦ భాగ్యలార।
ఆరోగ్యమస్తు, మీ ♦ కఖిలదిగ్విజయోస్తు ।
సమ్మానమస్తు, సు ♦ స్వాంతలార ।
కల్యాణమస్తు, మీ ♦ కత్యంత శుభమస్తు,
ప్రియమస్తు, విభవోస్తు ♦ వెలదులార .
విజ్ఞానమహిమాస్తు ♦ విశ్రుతవిజయోస్తు,
సౌశీల్యమస్తు, సు ♦ జ్ఞానలార ।
గీ॥ సరస గీతాది సాహితీ ♦ సహితలార ।
చిత్త సామ్రాజ్యవైభవ ♦ శ్రేయలార ।
లక్ష్మి - శారదలార ! శ్రీ ♦ లలితలార ।
నిత్య సౌభాగ్య మగు మీకు ♦ నెలతలార॥ 1

గి. వెం. రామమూర్తి.
Dy. Inspector of Schools,
PENUGONDA,
West Godavary Dt.

**27—9—'31.**

సీ. పద్మినీద్యుమణుల ♦ బాంధవ్య గరిమంబు ।
నిందుకైరవముల ♦ పొందునెమ్మి ।
సురధునీ, సుమనుల ♦ చోద్యంపు నెయ్యంబు ।
జ్ఞానమానసిక ప్ర ♦ శస్త మైత్రి ।
ప్రసవ షట్పదముల ♦ ప్రఖ్యాతసఖ్యంబు ।
ఘనచాతకంబులు ♦ గాంచు పొత్తు ।
సుమసౌరభంబుల ♦ సొంపైన మిత్రత
కుముదేశు కౌముదీ ♦ కూర్మిపేర్మి ।

గీ॥ కైవడి వరలు సాహితీ ♦ గానకళలు ।
లక్ష్మిశారద కాంతల ♦ లలితకూర్మి ।
లతికఁ బుష్పించు గావుత! ♦ ప్రతిభకొనఁగ ।
వింతనా, ననతాపి, ది ♦ గంతములకు॥

Advocate
Rajahmundry. } జా. సత్యనారాయణమూర్తి



# ఇష్టదేవతాప్రార్థన.

## కాత్యాయనీస్తుతి.

మ॥ కమనీయాచల రాజవంశజమణీ ♦ కైలాససంవాసినీ ।
రమణీలోకవిహారిణీ, త్రినయనీ ♦ రాకేందుసద్భాషిణీ।
శమశాంత్యాది సలక్షణీ, వితరిణీ ♦ సౌభాగ్యసద్దాయినీ
మముగాపాడుమా, సర్వదా, కరుణతో ♦ మాతల్లి
మాహేశ్వరీ॥ 1

## లక్ష్మీస్తుతి.

శా॥ మాతా, పూ, రమణీమణీ, ఏలికా ♦ మాలక్ష్మి, కాంతా
మణీ । గీతాగానవినోదినీ, సుజననీ ♦ శృంగారిణీ, మానినీ
చేతోమందిర వాసినీ, వినుతసౌ ♦ కల్యాణసల్లక్షణీ ।
పూతస్వాంత మొసంగి గావగదవే ♦ పూర్ణేందుబింబాననా॥

## సరస్వతీస్తుతి.

శా॥ వాణీ, మంజుల భాషిణీ, వినుతగీ ♦ ర్వాణీ, కృపాకారిణీ ।
వీణాపాణి, వినీలకుంతలల స ♦ ద్వేణీ, శుభాకారిణీ ।
పాణీకంకణ భూషిణీ, విమలస ♦ ద్భావప్రభావాయినీ ।
వాణీనన్ గృపజూడుమమ్మ, నిను, నా ♦ స్వాంతమ్మునన్
గొల్చెదన్॥

శ్రీ లక్ష్మీశారదలు.

చ. చలిమల పుత్రికాసుతుకు ♦ జంపకపుష్పసుగంధమాలలన్ ।
గలువల బిల్వపత్రముల ♦ గ్రన్నన జేర్చి, విశుద్ధభక్తినే
సలుపుదు నెల్ల పూజలను♦సంతసమొందుచు, నాదువాక్కు
నన్ జెలువుగ నిల్చి విద్యలను♦ జేకురజేయగ శ్రీరమాపతీ॥

ఉ. శారద! వాక్ప్రసూనముల ♦ జక్కని నీపదతోయజంబులన్
మీరక, బూజసేతు నిక♦మేలుగ నాదగువాక్కునందునన్
సారెకు నిల్చి నీమసర ♦ సంబగుపల్కుల బల్కనిచ్చి, నా
కోరికదీర నీకృపను ♦ గూర్మిని జిల్కుమ భారతీసతీ॥ 5

ఉ. పూతమనస్కులై భువిని ♦ బూజ్యతనొంది, యనేకగ్రంథ
ముల్ ప్రీతి నొసంగినట్టి కవి♦ పింగళిసూరన, నన్నయాదు
లన్, బోతన, కాళిదాస ఘన♦భోజనృపాలుర తిక్కనార్యు
లన్ నీతముతోడ గొల్తునవ ♦ నిన్ గను వేడుక శ్రీరమాపతీ॥

చ. సదయ! భవత్కృపన్ హృదయ ♦ సారసమందు గవిత్వ
కన్య, సొంపొదవగ నుద్భవింప గను ♦ పొందికగా జనువిచ్చి
పెంచి, నేమృదుమధురంపు బల్కులను ♦ మేలగుభూషల
నీయ జెచ్చెఱన్ ముదమొదవన్ ధరించుకొని ♦ ముచ్చట
గానదియావనాంగియై పృథివిజరింపసాగె నిక ♦ బ్రీతి ద
లిర్పగ శ్రీరమాపతీ॥ 7

చ॥ మిడిమిడిజ్ఞానమున్ గలుగ ♦ మేటికిరీటము మస్తకంబునం।
దిడుకొనినట్లు మోదమున ♦ నింపగు పద్యములల్లి,నిన్ను నే

దడయక బాడుచుంటిగద ♦ తప్పులు వ్యాకరణాదిదోషముల్
కడలకు నెట్టిభావముల ♦ గాంచుము ప్రీతిని శ్రీరమాపతీ॥

చ॥ తెలియదు యోగనిష్ఠ, యుప ♦ దేశమునొందగ లేదు దేనినిన్
దెలియవు నీ మహత్త్వములు ♦ తేటగ నీభువి సృష్టికల్పనల్
తెలియవు వేదశాస్త్రములు ♦ ధీనిధి! నిన్నె స్మరింతు నీకృపన్
జిలికి, కృతార్థ జేయు మిక ♦ శ్రీరమణీవర, శ్రీరమాపతీ॥

ఉ॥ వారిజపత్రనేత్ర, భవ ♦ పాపవినాశనపీతిహోత్ర, శృం
గారచరిత్రపూత్ర, ముని ♦ కామిత గాత్ర, రమాకళత్ర వి
స్తారచరిత్ర! దుష్టభవ ♦ సాగరభీతిలతాలవిత్ర, బృం
దారకబృందమిత్ర, పర ♦ తత్త్వసుధాంబుధి శ్రీరమాపతీ॥

చ॥ సిరులనొసంగు నీదుసతి, ♦ సేమముగూర్చెడు ప్రోడవీవు, సుం
దరతరసృష్టికల్పనల ♦ ధారుణి నీను సుతుండు జేయు, స
త్కరుణను నీదుకోడలు, ను ♦ దారగుణంబున విద్యగూర్చు, సు
స్థిరమతిమద్గృహంబున వ ♦ సింపుదు నల్వురు శ్రీరమాపతీ॥

ఉ॥ తల్లివి తండ్రివంచు మరి ♦ దాతవు నేతవు నీవటంచు, నన్
జల్లగ జూతువంచు, మది ♦ సంతతభక్తిని గొల్చుచుందు, నీ
వెల్లజగంబులున్ సతత ♦ మేలుచు నుండవె, పుణ్యశీల! నా
యుల్లము రంజిలంగ నెటు ♦ నోమదలంతువొ శ్రీరమాపతీ॥

చ॥ వినయవిధేయతామణుల ♦ వేడ్కఁ-గ నిన్ను నలంకరించెదన్
జనువున, బ్రేమమాల్యముల♦జక్కఁగనీగళసీమనుంతు, నే
ఘనమగుభక్తితోడ కర ♦ కంజము లన్నిసుబూజసేతునిన్
గనియెడిభాగ్యమీవె పర♦మస్మరచిన్మయ శ్రీరమాపతీ॥

ఉ॥ సత్యసుశీలుడంచు, నతి ♦ శాంతిసుభూషణుడంచు, భక్తులన్
నిత్యముగాతువంచు, మరి ♦ నీదరిజేరిన బ్రోతువంచు, నే
నిత్యము నీదుపాదముల ♦ నేమరకేభజియించుచుందు, నో
సత్యగుణస్వభావ! నను ♦ జక్కఁగజూడుము శ్రీరమాపతీ॥

ఉ॥ భాగ్యముగోరవెన్నను ♦ భక్తియు,జ్ఞానసుబోధతప్ప,యే
భోగ్యముగోర నీప్రభువి♦పూతగుణాంచితశాంతిదప్ప, నా
భాగ్యములన్నియివ్వెయని ♦ భావనజేతువు భవ్యశీల! నీ
యోగ్యతజూడవింతటనుగు♦నెంతటిపుణ్యమొ! శ్రీరమాపతీ॥

ఉ॥ నీదుకథాసుధారసము♦నిత్యము గ్రోలగ జూచుచుందు, స
మ్మోదముతోను నాకెపుడు♦మోహనరూప, భవత్ప్రతాప
ముల్। భేదముబాయ మద్రచిత ♦ గీతములన్నిను బాడు
కొందు, నన్। భేదముసేయబోకికను ♦ బ్రీతినిజూడుము,
శ్రీరమాపతీ॥ 16

మ॥ కని, చేకూర్చితివీవునాకు, సుగుణా♦కాంతున్, ప్రశాం
తున్, పతిన్। ఘనసంతోషము నొందితిన్, గలుగగా ♦

కంతుల్ జయంతుల్ సుతుల్, । మణిమాణిక్యములున్
కడున్ విమల సీ ♦ మంతల్ సుశీలల్ సుతల్, గన దీర్ఘాయువు
సౌఖ్యముల్ మము సదా ♦ గాపాడు లక్ష్మీపతీ॥ 17.

చ. అతులితభక్తితత్పరత♦నై నిను మ్రొక్కుచునుంటినయ్య, ని
న్నతివినయంబునన్ హృదయ♦మందుననిల్పుచు సేవ జేతు, నా
సుతునకు నీదునామమిడి♦సొంపుగ బిల్తును, శ్రీనివాస! నా
సతులనుగాంచు నీవెపుడు♦నన్ గరుణింపుమ, శ్రీరమాపతీ॥

చ॥ రతనపుబొమ్మలౌసుతుల ♦ రంజిల నిచ్చితినాకు, నీవికన్
సతతము గాచివారలను ♦ జాలగనాయువుబుద్ధియున్ బలా
బతులితసౌఖ్యముల్ గలుగ♦నమ్మెడిభాగ్యములొందజేయుచో
హితమతి నన్ను బ్రోచు టది♦యేసుమగోరితి శ్రీరమాపతీ॥

ఉ. చాలరు నీమహామహిమ ♦ జక్కగ వర్ణనసేయుగా కవుల్ ।
జాలరు నీస్వరూపమును ♦ జక్కగ వ్రాయగ జిత్రలేఖకుల్
జాలరు నీమహోన్నతిని ♦జక్కగ నెన్నగ మానిపుంగవుల్।
జాలుదునే కనుంగవను ♦ జక్కగ నిన్ గన శ్రీరమాపతీ !

చ. సతతము నీకనిన్ను మన ♦ సారగ ధ్యానముసేయుచుందు, నే
నతులితమోదమొంద కను ♦లారగ నిన్ గని, చేతులార ని
న్నతివినయాప్తిఁగొల్చి తని ♦వారగ బూజలుసేయుచుందు,
సన్మతి నను బ్రోవుమయ్య బుధ ♦ మానిత శ్రీకర
శ్రీరమాపతీ॥ 21

శా. రామా నీయనురాగమే ననుసదా ♦ రంజింప జేయున్
జుమీ। వ్యామోహంబున నిన్ను గాంచు టదెనా ♦ వ్యాపా
రమేయౌ జుమీ నీముందున్ వసియించుచుండగ నిక ♦ న్నే
నేమి గోరన్ జుమీ। నామోదంబులు నీ కటాక్షము
లెయరా ♦ నాభాగ్య లక్ష్మీపతీ॥ 22

ఉ. చెన్నగు నీపదర్శన వి ♦ శేషముచే మదినుత్సుకంబునన్
పెన్నిధిగన్నయట్టి నిరు ♦ పేదవిధంబున నుబ్బుచుందు, నా
పన్నుడు వార్ధియందుబడి ♦ బాధలనొందుచు నూత
గొన్నయ ట్లెన్నుచు, సంతసమ్మొదవ ♦ నే నినుగంటిని
శ్రీరమాపతీ॥ 23

ఉ॥ కోరనుభాగ్యభోగ్యముల ♦ గోరనుపెక్కుగుసౌఖ్యసంపదల్।
నేరములెంచకే మఱియు ♦ నెంతయుబ్రీతినిజూడుమంటి,నా
భారమునీవెయంటి,నిను ♦ భావమునందుననిల్పుకొంటి నన్
వేరుగ జూడకయ్య నిక ♦ వేడను పల్మరు శ్రీరమాపతీ॥

చ॥ అవిరతనీతిశీల, విమ ♦ లాంచితపూజితబుద్ధిశీల! యో।
భువనసుపాల, భక్తజన ♦ పోషణ,శ్రీధర,శాంతశీల! యో
భవహర, ధర్మలోల, ఘన ♦ భాసుర తేజ, సుకీర్తిలోల! హే
ప్రవిమలగానలోల,బుధ ♦ పక్ష!యధోక్షజ! శ్రీరమాపతీ॥

చ॥ పృథుతరభక్తిబూని,పృథి ♦ వీస్థలియందుత్వదీయనామమే
మదిదలపోయుచుందునభి ♦ మానముజూపిభవత్కటాక్షమున్

సదయతఁజిల్కి-శాస్త్రముల♦సారములన్ గ్రహియింపజేయనీ
మృదుమధురంపువాక్సుధను♦మేలుగనీయుమ శ్రీరమాపతీ

చ॥ స్థిరతరమానసంబు, గురు ♦ సేవ, సమాహితమాత్మ
భక్తియున్ । పరమపతివ్రతామణుల ♦ పావనజీవనమార్గ
రక్తియున్ । ధర గలుగంగజేసి దురి ♦ తౌఘములెల్ల
నశింపజేయుచున్ । సరసవివేకసంపదలు ♦ సౌఖ్యము
లీయుమ శ్రీరమాపతీ॥ 27

మ॥ నిధి నిక్షేపములొందగా మదినినే ♦ నెన్నండు గోరంగలే ।
దధికంబౌగతి నున్నతుల్ గనగ నే ♦ నాకాంక్ష సేయంగలే।
దధమం బిచ్చిన మట్టుకున్, నిలిపియే♦యాపత్తురానీకుమీ।
పృధుసౌభాగ్యము లీయుమీ, యవియె సు ♦ వ్వేప్రీతి
లక్ష్మీపతీ॥ 28

ఉ॥ వేకువలేచినిన్ మదిని ♦ వేడ్క-జనింప స్మరింతునయ్య, నిన్।
ప్రాకటభక్తి నెల్లపుడు ♦ ప్రార్థనసేయుచు నుందునయ్య, నే।
వీకనుబూని బల్కి-తిని ♦ వేరుదలంపక నమ్మినయ్య, య।
స్తోకమనోజ్ఞసంపదల ♦ దూగగ జేయుమ శ్రీరమాపతీ॥29

ఉ॥ సారెకు నీస్వరూపమును ♦ స్వాంతమునందుననిల్పి, భక్తి
పెం । పారగ నీకథల్ వినుచు ♦ భావపరంపరగూర్చి, నిన్
సదా । మీరక గొల్చుచుంటి, నిది ♦ మిథ్యయటంచు

దలంపబోక, నన్ । గారవ మొప్పజూడుము మిక ♦ కంజ
క్షణ, శ్రీరమాంపతీ॥ 30

ఉ॥ నీవెమదీయ దైవమని ♦ నెమ్మనమందున గొల్చుచున్న, నన్।
గావగ భారమాయెనె? మరి ♦ గాచిన నీకది నేర మౌనె? న
న్నేవగనైన బ్రోతు వని ♦ యెప్పుగ నిన్ననురక్తి వేడితిన్।
పావన, భక్తపాల, నను ♦ బాలన సేయుమ శ్రీరమాంపతీ॥

చ॥ పిలిచిన బల్కవేమి ? మరి ♦ పిల్వగనంపిన రావదేమి ? నే
నలసతఁజెందివేడితిని ♦ యంజలి జేయుచునుంటి నిత్యమున్,
పలుమరు మ్రొక్కులొందుటకు ♦ పాడియ ? నీ కదిసంత
సంబుకో ! చులకనజేయకయ్య నను సొంపుగ జూడుమ
శ్రీరమాంపతీ॥ 32

చ॥ ప్రవిమలనీతిశాలురను ప్రాభవమొప్పెడు భవ్యశీలురున్
అవిరతకష్టముల్ బడుదు ♦ రచ్యుత! నీదుపదారవిందముల్
చవిగొనలేని యాఖలులు ♦ చాలగ సౌఖ్యము నొందు
చుంద్రు, మా ధవ! తవపాలనం బునను ♦ ధర్మమదెక్కడ
శ్రీరమాంపతీ ? 33

చ॥ సరసిజలోచనుండవని ♦ సద్గుణధాముడవంచు, నాపయిన్
పరమదయాకరుండ వని ♦ పావనసచ్చరితుండ వంచు
నీ వరిమరలేక నన్నిక ♦ సమాదరతన్ దగజూతువంచు,
నే నురువిరలీలవేడితిని ♦ జూపుమ నీదయ శ్రీరమాంపతీ॥

చ॥ అనయము నీకు కీర్తన, స ♦ మాదర మొప్పగ బాడుకొందు, నీ | ఘనమగు పాదపద్మముల ♦ గాంచుచు సేవల జేయు
చుందు, నె | మ్మనమున భక్తి నుంచి, నిను ♦ మన్ననతో
స్మరియించుకొందు పా | పునుగన, నీకృప౯ జలికి ♦ బ్రోవుము
వేగమె, శ్రీరమాపతీ॥　　　　35

ఉ॥ నమ్మితిరామచంద్ర! నిను ♦ నమ్మితినో, ఘనకీర్తిసాంద్ర, నే
నమ్మితిదీనబంధు! కను ♦ నమ్మితి నీపదపంకజంబులన్,
నమ్మనవారికెన్నటికి ♦ "నాస్తి" యటంచును బల్కు-నీవు), నన్
నమ్మతిబ్రోచునట్టితగు ♦ సామివి నీవెగా! శ్రీరమాపతీ॥ 36

చ॥ భవహర! నామజాపముల ♦ పాపములై డవిసంటు సుమ్మి నీ
ప్రవిమల నామమున్ దలప ♦ పావనమైతి, భవత్కృపాంబుధిన్
కువలయనేత్ర! నన్ దనిసి ♦ కాంక్షని బ్రోచి, భయంబుదీర్చి, యీ
భువిసుఖమొంద జేయుమిక ♦ భూసురవందిత! శ్రీరమాపతీ॥

చ॥ తనయులుతప్పు జేయగను ♦ తల్లియు దండ్రిహితోక్తులేయుడన్
అనువుగ జెప్పినట్లుగ, న ♦ యమ్మున దెల్పి, దొసంగులున్నచో
మనుపగ జూచినారు, ఘన ♦ మార్గము జూపిన, బోనకుందునా?
చనువునొసంగినారు, సర ♦ సంబుగ దెల్పుము, శ్రీరమాపతీ॥

చ॥ జనమతి నీవటంచు, విని ♦ సంబుగ జూచుచు తప్పులెంచినన్
పుడమి భరింప గల్గుదునె? ♦ పుట్టినదాదిగ నిన్ని నమ్మితిన్
దడయక నీకృపన్ జలికి ♦ తప్పులనన్నిటి సైచి నీవు నన్
విడువక బ్రోవుమయ్య, నిను ♦ వేమరు వేడుదు, శ్రీరమాపతీ॥

జేసెదనంచు, నీ । చతురతనెంతగా బొగడ ♦ జాలుదునీభువి!
శ్రీరమాపతీ॥ 44

చ॥ కరుణయొకింతలేక, యవు ♦ గాదను యోచనసుంతలేక, నీ
దరికిని జేరగోర, నిజ ♦ దర్శనమీయవు, భృత్యకోటికిన్
మరిమరి వేడ బల్కవికి ♦ మానితి! నీకిది ధర్మమౌన ? నీ
చరితముజూడ వింతయగు ♦ జాలమునిన్ గిప, శ్రీరమాపతీ॥

ఉ॥ భూములు పుత్రులా, భువిని ♦ భూరిధనార్జన సాధనంబులా?
సేమముగూర్పగాదగు,వి ♦ శేషధనాదిసుభూషణంబులా?
వేమరుజూడగానిక, ని ♦ వెవ్వియులేవుగ ! జేయనేది ? నీ
ప్రేమయె, ప్రాపునాకికను ♦ బ్రీతిని జూపుమ, శ్రీరమాపతీ॥

చ॥ చిరతరబంధుగున్ బలెను ♦ చిన్మయరూప! సుధీవిశాల!
నిన్ । గురుతరభక్తినేడి, మరి, ♦ కోరి, నుతించి, స్మరింప,
నీకృపన్ కరతలభాగిమౌ దమల ♦ కంబునుబోలె, గ్రహిం
పగానగున్ । నిరుపమ! నీదునామమెద ♦ నిత్యము గొల్తును,
శ్రీరమాపతీ॥ 47

చ॥ తనువు లశాశ్వతంబులని ♦ ధారుణిమందుజరింపటొప్పునే?
ఘనముగ ద్రవ్యమూని, కల ♦ కాలము నిల్చెదనంచు నెంచి,
మే । మనుపుగ నిత్యకృత్యముల ♦ మాన్యతసల్పగ ధర్మమంచు,
నె । మ్మనమును నెంచగల్గుటకు ♦ మార్గముజూపుము,
శ్రీరమాపతీ॥ 48

ఉ॥ సంపెగ పుష్పరాజముల ♦ జల్లుచు నీపదతోయజంబులన్
సొంపుగ బూజసేతు, నిను♦ సుందరరూప! దయాంతరంగ!
నన్ । బెంపునుబొందజేసి, కడు ♦ బ్రీతిని జూచి, సుభాగ్య
మిచ్చుచున్।సంపదలాయురోన్నతులు ♦ సౌఖ్యములీయుమ,
శ్రీరమాపతీ॥ 49

చ॥ దినకరు రాకపోకలవి ♦ తీరుగనీమహిమంబుచేగదా!
దనరు! జరాచరంబులను ♦ దాల్చితివీవుదరంబులోపలన్
అనువుగనీదు భక్తహృద ♦ యాంతరమందువసించెదార!
యా। వనజభవాదులైన, నిను ♦ వర్ణనజేయగ జాలరీభువిన్
నిను బొగడంగ నాతరమె? ♦ నీకృపజూపుమ, శ్రీరమాపతీ॥

ఉ॥ కూరిమినీదుసేవ సమ ♦ కూరినదాదిగ, నేటిదాక, జే
కూరుచునుండె,సౌఖ్యములు ♦ కోర్కులుదీర శుభంబుబొం
దతిన్ । భారమటంచు నెంచక యె, ♦ భావినిగూడనిలాటి
భాగ్యమే । గోరుచునుంటినయ్య, నదె ♦ గూర్పుమ నాకిల,
శ్రీరమాపతీ॥ 51

ఉ॥ చిక్కని పాయసంబసగ ♦ జెల్లెడినీకథలేవినంగ, నీ
చక్కని నామమేను,మన ♦ సారగగ్రోలగ గల్గుచున్,సదా
మక్కువదీరనాదు మన ♦ మారగసంతసమొందుచుండగా।
తక్కిన వేల్పులెందులకు .♦ ధారుణినాకిక, శ్రీరమాపతీ॥

చ॥ గురుతరభక్తిబూని, నిను ♦ గూర్మిభజించుసుధీవరుల్ తగన్।
గరమునద్రిప్పు ధాత్రివలె ♦ గాంతురునీఘనసత్ప్రభంబు, నీ।

చరణవిదూరులై, యితర♦ చెవులోన ర్చెడుమూఢమానవుల్
ధర, బలుబాధలన్ బడుచు♦ ధన్యతగాంచరు, శ్రీరమాపతీ॥

ఉ॥ మించినభాగ్యవంతుడవు ♦ మెచ్చగ జేతుపరోపకారముల్
మంచిగ నీదుభక్తులను ♦ మానక నీ వెపుడుద్ధరించుచున్
వంచన జేయవేరినిక ♦ వందనముల్ గడునొందుచుండెదా
యెంచగ నాదుపుణ్యమున♦నే నినుగంటిని, శ్రీరమాపతీ॥

ఉ॥ సారసనేత్ర, సద్విమల ♦ సత్యసుశోభిత, శాంతిభూషణా
వారకనీదు సేవకుల ♦ వాసిగ గాంచుచు బ్రోచుచుందు, వా
భారముమీద వైచికొని, ♦ భారమటంచన బోకయే యెడన్
నేరము లేమి యున్ననిక ♦ నేమిగణింపవు శ్రీరమాపతీ॥

చ॥ సదమల భక్తియుక్తముగ ♦ శాంతిగుణాంచిత నిర్మలాత్మనై
వదలక, నాహృదబ్జమున ♦ వాసిగ నిన్ననురక్తినిల్పి, నీ
పదసరసీరుహంబులను ♦ బాయక నేముద మొప్పగొల్తు, శ్రీ
సదనవిశాలవక్ష! మన ♦ సారగ బ్రోవుమ, శ్రీరమాపతీ॥ 56

చ॥ పరమదయాబ్ధి! నీదుపద♦పంకజముల్ గతియంచునమ్మి, నే
కరమనురక్తితోడనిను♦గాఢపుగూర్మి భజింపుచుంటి, నీ
కరుణ యొకింతజూపి, ఘన ♦ కామిత సౌఖ్యములొంద జేయు
చున్ । వరము లొసంగి, భాగ్యమిడి ♦ వర్ధిల జేయుమ,
శ్రీరమాపతీ॥ 57

ఉ॥ పాపపుకార్య సంగతుల ♦ బాల్గొని నేజరియించితీ భువిన్
నీపయి బుద్ధినిల్పి, కడు ♦ నేర్పుననిన్ స్తుతియింపనైతి, నన్
“బాపి,”పటంచు దూఱక, కృ♦పాజలధిన్ ననుఁ జేర్పుమయ్యా
నా। ప్రాపగు వేల్పునీవయని ♦ ప్రార్థన జేసితి, శ్రీరమాపతీ॥

ఉ॥ సేయుదునీదుపాదసర ♦ సీరుహసేవలనెల్ల బ్రొద్దులన్
వ్రాయుదు నీదుగీతముల ♦ బ్రాభవమున్ గనిపించుసూక్తులన్
బాయక పాడుకొంచు, నిను ♦ ధ్యానమునం దిడుకొందు
నయ్యా, । నా శ్రేయముజూపుమయ్యా, బుధ ♦ సేవిత !
శ్రీయుత ! శ్రీరమాపతీ॥ 59

శా॥ “నిర్వ్యాకార”బడియున్న నీ, గుణములన్, ♦ నే నెప్పనీకే నహో,
సర్వేశా! నిను, నమ్మగా, గలిగెదా. ♦ నే శక్యంబులేదయ్యో! నా
కుర్వీన్, కష్టములేసదా, గలుగగా ♦ నోర్వంగ నెవ్వానికన్
సర్వజ్ఞుండవు, నీవెచెల్పగదవే! ♦ సత్యాత్మ లక్ష్మీపతీ॥ 60

ఉ॥ వేడిన, వేడినన్ గొలది ♦ వేడ్క నినికగుచుండుగాదె! నన్
గాఢపుజింతలన్ గొలిపి ♦ కష్టపరంపర లొందజేయు, నే
వేడగ బోనునిన్నికను ♦ వేడని వారలె, సౌఖ్యసంపదల్
జూడగ బొందుచుందురిల ♦ జోద్యముగల్గెడు, శ్రీరమాపతీ॥

చ॥ అడిగినవెంటనే, యెవరి ♦ నైనను బ్రోచితి వయ్యనీవు? ని
న్నడుగుచు, బాములన్ బడుచు ♦ నారటజెంది, విసుగు
నొంది, యా। కడపట బ్రాణముల్, విడున ♦ గాదలపోయు

చునుండు వేళ, నే । వమున్రుస నోగడుంగెను, ర ♦ వంత,
దలాపగ, శ్రీరమాపతీ॥ 62

ఉ॥ దూషణభూషణంబులను♦తోయజనేత్ర!సమానముంచు, నే
యీసడముల్ నుపన్గొనక♦యోచప్రదూషణ జేసిరంచు, నీ
భూషణముసీక సిగపగ♦బుద్ధియు, శాంతియు, భూషనంద్య, వే
భాషలికేలనో, చూసను! ♦ భవ్యగుణంబుపెన్రు, శ్రీరమాపతీ॥

ఉ॥ భక్తవేషులన్గొనుచు ♦ భావము సంహసన తసించుటే
యుక్తమటంచునెంచి, యిక ♦ నూగకనుంటుట నాయమహా
నుకో? రక్తిగనింకభక్తులను ♦ రంజిలజేయుచునుంట్లు సైత
ముంన్ । యుక్తముగాదె! నీకరాల ♦ నోములుకోపన?
శ్రీరమాపతీ॥ 64

ఉ॥ తానకనామకీర్తనము, ♦ తప్పకబాడుచునుంటిగాదె, నే
తానక పాదపద్మముల ♦ ధ్యానము జేయుచునుంటిగాదె, స
ద్ధ్యానములొందగా, నెపద ♦ భావననిత్యముసేతుగాదె! నన్
బ్రోవగ రాగజేయికను ♦ భూరిగుణాకర! శ్రీరమాపతీ॥ 65

ఉ॥ యుక్తమటంచు నెంచితివె? ♦యూరకనుండుట భక్తి వీడి, నీ
భక్తునివీడియుంటినను ♦ భావమునీమది జింతగొల్పు, నన్
యుక్తజూడలేదనుచు ♦ నుమ్మలికంబికనాకుగల్గు, నీ
భక్తుని జేర్చు నీదరికి ♦ భవ్యమదిర్వ్వరకున్, శ్రీరమాపతీ॥

చ॥ నయముగ నీముఖాంబుజము ♦ నారయుచుంటయె నాకు,
విందు, నే। నియమముతోడ వేడితిని ♦ నీరజనాభ, మదీయ
సేమ, మా। రయనికనీవెగాదె! గుణ ♦ రాజిత, పూజిత,
భవ్య తేజ! నీ। ప్రియము గు పల్కులన్ వినగ ♦ వేడుక నాకది,
శ్రీరమాపతీ॥ 67

చ॥ పరమదయాకరా! సుగుణ! ♦ భాస్కర తేజ, విరాజమాన! హే
సురుచిర, ధీవిశాల! మృదు ♦ సూక్తి విలోల, సుధర్మ
పాల! ఓ। దురితవిదూర! భక్తజన ♦ తోషణ, పోషణ!
మానిపాల! నే। శరణని మ్రొక్కుచుంటి, ని నె ♦ శాంతి
విభూషణ శ్రీరమాపతీ॥ 68

చ॥ నిరతమునీపదాబ్జముల ♦ నిక్కముగాభజియించుచుంటి, నా
నెరపునుమాన్పుమయ్య, నిను ♦ వేయువిధంబుల బ్రస్తు
తింతు, నీ। కరుణయె, బ్రాపటంచు, గని ♦ కాలమునే నెట్టుచుంటి, నో। సరసిరుహాక్ష! నీకృపను ♦ జక్కగ
జూపుము, శ్రీరమాపతీ॥ 69

ఉ॥ నీవచనామృతంబుగన ♦ నిండగు వీనుల విందునాకు, నీ
భావన యేసదామదికి ♦ భవ్యతనిచ్చుచు నుండునాకు, నీ
సేవయెగాదె, యెల్లపుడు ♦ సేమము, ప్రాపు, నొసంగు
నాకు, నన్। బ్రోవగనీవెగాదె! మరి ♦ బ్రోవగ నెవ్వరు?
శ్రీరమాపతీ॥ 70

చ॥ సిరిహృదయాంబుజన్ వరలు ♦ శ్రీధర! యీభవసాగరంబు, నే।
నరయఁగ నీ సహాయ్యమున ♦ నానుగనుంగొని యీదఁగల్గు
దున్ । విరివిగరంబు గోరనికి ♦ వేడుక నీకృప యొండు
దక్క, న । న్నరమర లేక, జూముచు, కృ ♦ తార్థను
జేయుమ, శ్రీరమాపతీ॥  71

మ॥ మదమాత్సర్యములన్ జయింప, పృథుస ♦ న్మార్గంబులన్
జూపు, మో । సదయా! కరకి తెప్పవై, యితర వ్యా ♦
సంగాలనేఁగోక, నా । హృదయంబందు త్వదీయనామము
నునే ♦ నేవేళ సేవించి, నీ । పదరాజీవములంటి
భాగ్యమిడు! నా ♦ పాలింటిలక్ష్మీపతీ॥  72

చ॥ తనివిగ ధర్మమార్గము, ను ♦ దార! దయాదిగుణంబులున్,
సదా । దనరగ, సాధువర్తన, య ♦ థావిధిగానడుపంగ
జాలుచున్ । ఘనమగు నీదుభక్తి మెండు ♦ గారన మొప్పెడు
భాగ్య మిచ్చుచున్ । ఘన, ధన, ధాన్యసంపదల ♦ గ్రాల
గ జేయుము, శ్రీరమాపతీ॥  73

చ॥ పటుతరభక్తి నీపదము ♦ బట్టగ నెంచిన గానరావు, నీ ।
వెట జరియింతువో, యనఘ! ♦ యేవిధి, నీపదమంట
సాధ్యమో, । కిటుకును దెల్పు, మానసపు ♦ కీరము నీపద
పంజరంబునన్ । దిటవుగ నుంతునేను, జగ ♦ తీధవ!
నిన్నన, శ్రీరమాపతీ॥  74

శా॥ నీవేతల్లివి, తండ్రివిన్, పతివియున్ ♦ నీవే మదీయాప్తుఁడున్
నీవే నాదగు బంధువున్, గురుఁడవున్ ♦ నీవే గదా, శ్రీకరా !
నీవే గన్ గరుణించి బ్రోవు, మనఘా! ♦ నీకన్ బ్రసన్నుండవై
శ్రీవైకుంఠనివాస! యాశ్రితనుతా! ♦ శ్రీ లక్ష్మీకాంతాపతీ॥

ఉ॥ శ్రీరమణీయగాత్ర, బుధ ♦ సేవిత పాత్ర, జగత్పవిత్ర, నే|
ధామతి వాక్ప్రసూనముల ♦ దావక పాదపయోరుహంబు
లన్ గోరికతోడ బూజలను ♦ గూర్మిని జేసి, స్తుతించుచుంటి, దు|
ర్వార భయాంధకారముల ♦ బాపగ జేయుము, శ్రీరమాపతీ॥

ఉ॥ భూములు పుత్రమిత్రులును ♦ బూనికతో నిను గొల్వలేక, నే
నీతిని ధర్మకర్మలను ♦ నేర్పుగ జేయ, త్వదీయపాదముల్|
ప్రేమను గొల్చు భాగ్యమును ♦ బ్రీతిని నాకొసగూర్పు
మయ్య నే| నీమమునన్ భక్తనుతుల ♦ నెప్పుడు సేతును,
శ్రీరమాపతీ| 77

ఉ॥ శ్రద్ధగ నీదుపూజ, మరి, ♦ స్నానముసంధ్యయు, పెక్కు-
నేమముల్| తద్దయు నర్థిపూజలును ♦ దానము, ధర్మపరోప
కారముల్ | పెద్దగ జేయలేను, నిను ♦ బేర్మిభజించెద
నంతెగాని, వే | రొద్దియు జేయలేను, నను, ♦ నెట్టుల
బ్రోచెదో! శ్రీరమాపతీ॥ 78

చ॥ ఘనమగు సౌఖ్యసంపదల ♦ గంటిని, నీదుకృపారసంబుచే|
వినుటకు నీదుపల్కులవి ♦ వీనులవిందుగ దోచుచుండు, గారు

నీ సంసర్గంబును బొందుచున్, మదిని నే ♦ సంతోష మొందంగ, నన్ । సంసక్తిన్ గని. ప్రేమ జేకొనుమ, హే ♦ శాంతాత్మ లక్ష్మీపతీ॥ 84

చ॥ నిరతము మోహపాశముల ♦ నీ భువిబందిగనుంటిగాని, నీ పరమపవిత్రి నామమును ♦ బల్మఱుదల్పగ బాశముక్తనై, ధరణి జరింపగల్గితిని ♦ ధన్యసటంచుమదిన్ దలంతు,నీ చరణయుగంపు సేవలను ♦ జాలను మానగ,శ్రీరమాపతీ॥

చ॥ తపములుజేయుకొంటె, మరి ♦ దానము ధర్మపరోపకారముల్ । విపులతజేయుకొంటె, భువి ♦ విస్రుతకీర్తిగణించుకొంటె,తా । కపటముపీడినిత్యమును ♦ గల్మషదూరుడుగాగనున్న,నీ । కృప బడయంగవచ్చు, గద ♦ కిల్బిషఖండన, శ్రీరమాపతీ॥ 86

ఉ॥ ఎంతని వేడుకొందు, నిక ♦ నెమ్మెయి నీకృప నేనుగందు, నీ వంతమికెంత మట్టుకు, న ♦ నంతసుఖంబొసగూర్పరావె! నే సంతస మొందుచుండగను ♦ సాదర మొప్పగజూడలేవె? యావంతదయారసంబునిక ♦ నైననుజూపవె?శ్రీరమాపతీ॥

చ॥ వరదుడవంచు మున్ను బుధ ♦ వర్యులుపల్కగ నిన్నెబట్టితి ద్ధరణిభవత్ప్రభావములు ♦ ధర్మవిరుద్ధముగాగదోచు, నీ చరణములాశ్రయింపగను ♦ సౌఖ్యమునాకొనగూర్తువంచునే శరణిని నమ్మగల్గుదును ♦ గాఢముగామది, శ్రీరమాపతీ॥

ఉ॥ శ్రీరమణీకళత్ర, నిను ♦ చిత్తమునందున గొల్చుచుంటి, నే
ధారుణి జేయు పాపముల♦దాహము జేసి, దయార్ద్రదృష్టితో
వారకనన్ను జూచి, ♦ హితభావమునన్ దగ బ్రోచి, తృప్తి
యున్ । ధీరతనిచ్చి బ్రోవు, జగ ♦ తీధవ! వేడితి, శ్రీ
రమాపతీ॥ 89

ఉ॥ భేదము లెంచకెప్పుడు ♦ ప్రేమవహించుచు భక్తకోటిపై
బోధల వెన్నొ జేయుచును ♦ శోధిమి జూపుచు లోక
మాతటన్ । మోదమునొందెదా, మరియు ♦ మోదము
నిత్యము నిచ్చుచుండెదా । భూతదయాపరుండవుగ! ♦పూత
గుణాన్విత, శ్రీరమాపతీ॥ 90

చ॥ అనవరతంబునీపద, స♦మాశ్రయమిచ్చుచు, సంతసంబునన్
ఘనతరధర్మమార్గముల♦గాంచగ జేయుచు, ధన్య జేసి, నిన్
వినయుత, భక్తిగొల్చు, పద♦విన్ మనమందున నాటజేసి, న
న్నవయము బ్రోచి నీకృప స♦నారతమీయుము, శ్రీరమాపతీ॥

ఉ॥ తారకనామ, నాదుమని ♦ దావలమైవసించి, విద్యవి
స్తారముజూపుమయ్య, నను♦ధన్యనుగా భువి జేయుమయ్య,
సీ । చారుదయార్ద్రదృష్టి, నతి ♦ చక్కగ జూపుచు, మాతృ
భాష జే। కూరగ జేయుమయ్య, నిను ♦ గూర్మిభజించెద,
శ్రీరమాపతీ॥ 92

ఉ॥ ధర్మము నీవెయయ్యెద వ ♦ ధర్మములన్నియునీవెయౌదు, వా । మర్మములన్నినీవెయిక ♦ మర్మములేమియు నీవుగావు న । త్కర్మలవన్ని నీవె, మఱి ♦ కర్మలవేవియునీవుగావు, నీ మర్మములన్ని నాకెఱుక ♦ మాటలికేటికి, శ్రీరమాపతీ॥93

ఉ॥ ఇంతగ వేడుచుంటిని ♦ యీసుదిలంపగ న్యాయమౌనె? నా వంతలబాపుదైవమని ♦ వాసిగనిన్ భయభక్తి నామదిన్ । సంతసమొప్పగొల్వగను ♦ సమ్మతితో ననుజూడలేవె? నీ స్వాంతమునందునన్ను నిడి ♦ సౌఖ్యములీయుము, శ్రీరమాపతీ॥

చ॥ గిరులును వృషరాజ, భుజ ♦ గేంద్ర, మృగేంద్ర, సమీర సాంద్రముల్ । పసుగిడుమేఘముల్, దివిని ♦ భానులుదీర్చిన తారకాళి, సుం । దరతర సస్యభూములును ♦ ధారుణి నీవుసృజించితౌర! యెం। తబ్బురముగనీసు సృష్టిగన ♦ భూతలమందున, శ్రీరమాపతీ॥ 95

శా॥ గోపాలా వసుదేవనందన హరీ ♦ గోవింద మాంపాహి! నా ప్రాపీవేయని నమ్మియుంటినిగదా ♦ రావే జగద్బాంధవా! యీపాపాంచాలికి ద్రోపదీసతికయి, సు♦ వాక్త్రిన్ బ్రసన్నుండవై నీవేప్రేమన్ దగజూపి, గాచితివి నే ♦ నీదాస, లక్ష్మీపతీ॥ 96

చ॥ ఘనమగునీదు చెల్మి, భువి ♦ గాంచుట యెట్లు, పదివేలునాకు, నో । వినుత గుణాఢ్య, నీకృపను ♦ వేడ్కనుబొందుట

మ॥ జననంబిచ్చితిసద్యశోయుత సదా ♦ చారాన్వితంబౌ కులం
బును జేకూర్చితి నీవు నాకు సుగుణా ♦ పూర్ణున్ గృపా
సాగరున్ । మనముం దాన్ సుఖమిచ్చుపుత్త్ర ప్రియును, స ♦ న్మా
నంబు సౌభాగ్యమున్ । గనన య్యెన్ గద ! యంచితంబు।
నవె, శ్రీ ♦ కాత్యాయనీ, నీ దయన్॥ 101

శ్రీ॥ గిడుగు లక్ష్మీ కాంతం.

# లక్ష్మీశారదా శతకము

16. 6. 86.

## "శ్రీ శారదా" పతి శతకము.



మ॥ భవదాశీర్వచన ప్రభావమున నా ♦ స్వాంతంబు మేల్ జేసి, నా
కవితాకోర్కెలు పల్లవింప, పదముల్ ♦ గల్పింగ సయ్యోన్,
జమీ । నవనీతంబగు నీదు మానసమునా ♦ నందంబు
నొందింప, నీ । యువతీరత్నము, శారదాంబయిపె వ్రా ♦
యున్, శారదాంబాపతీ॥ 1

ఉ॥ వందనమేను జేతు, బుధ ♦ వందితు డాశ్రితరక్షకుండు, మా
యింటను ధరేంద్రనందను, న ♦ నేకవిధంబుల బ్రస్తుతింతు
నా । డెందము నందునిల్పుచు, న ♦ ఢీన్ నెగ వెల్వగ కావ్య
సంతతుల్ । పొందుగ ముందె వేడెదను ♦ పూతచరిత్రుని,
శారదాపతీ॥ 2

చ॥ సదయుత నాహృదబ్జమున ♦ సాహితికన్య సముద్భవింప, శ్రీ
మృదుమధురంపుబల్కులను ♦ మెలుగ నామెను ముగ్గువెట్టి, స
త్పదముల నేర్చి, యామెవలన, న ♦ వాంగసుగానోన్నతూర్చి,

యిచ్చితి । మ్మున్మదిత, గుణాలవాలను, స ♦ మూల్యపు
గాంతను, శారదాపతీ॥ 3

ఉ॥ నీతముతోడ భాషకవ ♦ నిన్ బహు భాషలోసంగినట్టి,స
ప్రీతలు, మొల్ల, ముద్దుపళ ♦ వేంకిమలన్, మదినెంతు,
పూతలా । సీత, శకుంతలాది, విదు ♦ షీమణులన్ మన
మందునొల్చెదన్ । పూతచరిత్ర ! భాషముల ♦ బుట్టగఁజే
యుమ, శారదాపతీ॥ 4

చ॥ కలువల, బువ్వసంతతుల ♦ గ్రన్నన జేర్చుక నీదుపూజలన్
సలిపెద భక్తితోడ, నిను ♦ సన్నుతిజేసెదనయ్య, నిత్య
మున్ । సలుపుమునాయ సంపదల ♦ చక్కనిభావములిచ్చి,
వాక్కునన్ । జెలువుగనుండి, విద్యలను ♦ జేకురజేయుము,
శారదాపతీ॥ 5

చ॥ మిడిమిడి జ్ఞానముంగలుగ ♦ మేరువుపర్వతమెక్కినట్లు, నే
వడివడి పద్యమల్లి, నిను ♦ వర్ణనజేసి నుతించుచుంటి, నన్
గడువషిప్రేమ జూంచి, యిక ♦ గల్గెడు వ్యాకరణాది దోష
ముల్ । వెడచెవిబెట్టి, తద్రసము ♦ ప్రీతిగ్రహింపుము,
శారదాపతీ॥ 6

చ॥ చదువగలేదు గ్రంథముల ♦ శాస్త్రములన్ గ్రహియింప
లేదు, నే । జదువగలేను, లక్షణము ♦ సంస్కృతమేమియు
నాకురాదు, నా । మెదనుదయించినన్ నుతి ♦ యింపగ

గోర్కెమరేమిగోర, నన్ । సదయత జూచి, తప్పులను ♦
సైపగదేయిక, శారదాపతీ॥ 7

చ॥ సదమల సచ్చరిత్ర, బుధ ♦ సన్నుతిపాత్ర, పవిత్రగాత్ర శ్రీ
యుదధినివాసపుత్ర, పురు ♦ హూతసుమిత్ర, సరస్వతీసతీ
హృదయనివాసమాత్ర, పృథి ♦ వీస్థలినేత, విశాలనేత్ర, నీ
పదసరసీరుహంబులను ♦ బట్టితి, పాడితి, శారదాపతీ॥ 8

చ॥ క్షితితలనాథుడీవె, కను ♦ చిత్రవిచిత్ర సుకల్పనాళిచే
వితత విరాగివీవె, నిక ♦ వేనిని, నీవెపుడంటకుంటచే
అతులితభోగివీవెగద! ♦ యన్యములేవియు గోరకుంటచే
హితమతి వీవెయందఱకు ♦ హే, సుగుణాకర! శారదాపతీ॥ 9

ఉ॥ పండితవర్య నిన్నెపుడు ♦ భక్తిగ గొల్చుచునుంటిగాదె, భూ
మండలమంత, యేగినను ♦ మానకనిన్నెడ బాయకుంటి, నీ
యండను జేరియున్ననను ♦ నాదరమొప్పగ జూచుటొప్పదే?
మొండిగ, వేడజాలనిక ♦ మేలుగ జూడుమ, శారదాపతీ॥ 10

చ॥ నయముగనీ ప్రసన్నవద ♦ నమ్మగు నాకనుదోయి విందు దు
ర్జయహరహా, త్వదీయపద ♦ రాజితపాంశువెనాకు మందదే
నియతిని నైన నగ్గనుము ♦ నీపనులన్నిటికంటెముందు, నీ
ప్రియమగు పల్కునాకెపుడు ♦ వీనులపండువు, శారదాపతీ॥

ఉ॥ నీవుసృజించినట్టి కమ ♦ నీయమనోహరభాగ్యభోగ్యముల్
నీవశమాటలేదవియు ♦ నీకును భోగ్యము లాటలేమ, సం

భావనజేసి, నేనితర ♦ భాగ్యముగోరిన లాభమేమి, స
ద్భావముగూర్చి నాకిక,ము♦దంబొనగూర్పుమ శారదాపతీ॥

ఉ॥ వ్రాతలువ్రాసెదా, మిగుల♦బ్రాజదువుల్ చదువంగ నేర్చితీ
వాతతదీక్షబూనుచు, స ♦ యాచిత చిత్రవిచిత్ర కల్పనల్
నీతముతోడ జేసెదవు ♦ నీడగుభావము తేటగాదె. కీ
భూతలమందు నేరికవి ♦ బోధకమౌనొకో! శారదాపతీ? 13

ఉ॥ కారణమారయంగ, బహు♦కష్టము,కష్టము, నీకుచర్యకున్
భారమనంగబోవు, భువి♦భాగ్యము లెవ్వియుగోరబోవు, నీ
శారదకూడనీకతగు ♦ చారుసుగీతవినోద మొందుచున్
గోరదు సౌఖ్యసంపదలు ♦ కూర్చుటనీకదె, శారదాపతీ॥

ఉ॥ నిన్నెదదల్చువారలును ♦ నీకొఱకై, మది చింతజేయువా
రెన్నగనేరులేరు, గద ! ♦ యేకడజూచిన గానరారు, నీ
యన్నులమిన్న, శారదొక ♦ యంగనదప్ప, దలంప రెవ్వ
రున్।యెన్నగ, నానెలంత, సతి♦ నేనియుజేరవు, శారదాపతీ॥

ఉ॥ ఎచ్చటనుండియో, మిగుల ♦ నెవ్వియొ వ్రాతలువ్రాతు
గాని నీ। విచ్చటనుండి వ్రాసినను ♦ వీలగుసట్లుగ వ్రాయ
జేయమే, । సచ్చవికేరి యోచనలు ♦ సచ్చును నీ
కవి తోచినట్లనే । జెచ్చొఱజేతు వంతె, యిక ♦ ఒప్పన
దేటికి, శారదాపతీ॥ 16

ఉ॥ వ్రాతలు వ్రాయగల్గుటకు ♦ వ్రాసెడిలేఖిని, నీయధీనమే
వ్రోతగ, నేతగన్ మఱియు ♦ భూరిసుకల్ప వికల్పనాదులుఁ
నీతరమౌనుగాదె, యిక ♦ నేనినుగోరినరీతి వ్రాయగఁ
నీతము నాకు జేయుమిక ♦ నేమని వేడుదు, శారదాపతీ॥

ఉ॥ పట్టినదాది, నీదుపద ♦ పద్మము లేగతియంచు నాత్మలో
గట్టిగనమ్మియుండనను ♦ గాసిలజేసి, కృశింపజేయ, నే
నెట్టులనోప గల్గుదును ♦ నీసుజనించె, విసుంగుగల్గె, నఁ
బుట్టగజేసితొందులకు ♦ భూతలమందున, శారదాపతీ॥ 18

ఉ॥ ఆపదలందు బాంధువని ♦ యార్యులు, వల్కగ నేను వింటి, నే।
నాపదలందునుంటి, నిక ♦ సమ్మమము నీకును నాకు జెల్మి,
నా। ప్రాపగుబాంధువీవె, నిను ♦ బట్టితి వీడను, వీడనింక, నీ
దాపున జేర్పుమీ నను,ను ♦ దారగుణాకర, శారదాపతీ॥

ఉ॥ నీసరివారులేరనుచు ♦ నేమదినెంచుచు నిన్నెగొల్చితిన్
నాసరిదాసగావనుచు ♦ నన్విడబోకుమ, నాయమౌనొకో!
వేసటగల్గజేయకుమ ♦ వేమరువేడగ, నీసడింపకే
దాసిని బాధుచుంటిగద ♦ తావక నామమె, శారదాపతీ॥

చ॥ సదమల భక్తితత్పరత ♦ శాంతితమోగుణ సద్గుణంబులున్
చెదరని మానసంబు, కడు ♦ సేమమునాకొనగూర్చి, నామ
నో। సదనమునందునిల్చి, సుఖ ♦ సంపదగూర్చి, సుభాగ్య
మిచ్చి, నా।మదివిమలంబొనర్చి, నను ♦ మాన్యత జూడుమ,
శారదాపతీ॥ 21

మ॥ అనుమానంబులనన్నిటిన్ విడచి, ధా ♦ త్మాత్మన్ సదా
యాచు నే। నిను ధ్యానించుచు, నుండెదన్, మదిని,
యో ♦ నీరేజపత్రేక్షణా। జనితానందము మీఱ, నీపద
ములన్ ♦ సద్భక్తిపూజింప, నాఘన పాపంబులికంతరించె
డుగదా! ♦ కాపాడు వాణీపతీ॥ 22

చ॥ తపముల జేయలేనన ఘ! ♦ దానములీయగశక్తిలేదు, పా
ప పుజతడాత్మ నింకను ప ♦ వాసజపాద లు సల్పలేని, కే
నెపముననన్ను గాచెదవో! ♦ నీదయగల్గభయంబులేదు, నా
చపలతబాపిసత్క్షమము ♦ జయ్యను జూపవె; శారదాపతీ॥

చ॥ అగణితశాంతభూష, దురి ♦ తౌఘ వినాశ, జయప్రదాయ
కా। నిగమసమూహరక్ష, తరు ♦ణేందు నిభాస్య, సరస్వతీ
సతిన్। సుగుణవిలాసభాసినిని ♦ శోభనగాత్రి గ్రహించి
తయ్యా, యీ। జగతియెనీకు మందిరము ♦ చారుగుణాకర,
శారదాపతీ॥ 24

చ॥ పరమ దయాళు వార్తజన ♦ పాలిటిపెన్నిధివంచు, నిన్ను
నే। కరమనురక్తివేడ, కని ♦ కారము జూపవు, కష్టజాల
ముల్। తరమెభరింప, నాతలకు ♦ దాటె, భరింపగలేను
సుమ్మ, నే। బరువె? భరింపలేవె? పెర ♦ వాడవెవీడగ ?
శారదాపతీ॥ 25

ఉ॥ చెచ్చెఱ ద్రవ్యమిమ్మనను ♦ చేర్పఘనంబగుసౌఖ్యసంపదల్
హెచ్చుగగోరలేదికను ♦ హేమమయాంచిత సౌధరాజముల్

పెచ్చుగ నాదు ప్రార్థనము ♦ ప్రేమనుగైకొని, ప్రీతి
జూడుమా । సచ్చరితంబు నీయదియె ♦ సత్యసుశోభిత,
శారదాపతీ॥ 26

ఉ॥ శారద నేలెదంచు మది ♦ శంకను వీడి చరించుచుంటి, నా
భారము నీదె యంచుగద ♦ పాలనుముంచిన నీటముంచినన్
గారని మొప్పగాంచుమిక ♦ కల్మషదూర! కడింది వేడితి
న్నేర మొనర్చి యుండినను ♦ నేమిగణింపకు, శారదాపతీ॥

ఉ॥ నీదగు కల్పనాది బహు ♦ నీమములన్ గొని, లోకమంత
యున్ । ఆదర మొప్ప సౌఖ్యముల ♦ నందుచునుందురు
గాదె! కల్పనా । బాధల ముగ్నియుండి, భువి ♦ భాగ్యము
లెవ్వియుగోరవారు! హా! । నీదగు త్యాగ మొంతయును ♦
నిక్కము, వంద్యము, శారదాపతీ॥ 28

ఉ॥ కోరగ నిత్తువే, చిఱుత ♦ కోర్కెల, నిచ్చిన, నిచ్చెదాసు
మా । ఘోరతరంబులై, ప్రజల ♦ గోలగలంగగ జేయునట్టివి । ఘోరము, తార ! నీకృతము ♦ లూరకపోవున? వాని
దద్దగా । భారము నెత్తివైచికొని ♦ బాధిక రావలె, శార
దాపతీ॥ 29

ఉ॥ భక్తులమంచు జేరి, కడు ♦ భక్తిని జూపి, సలాము జేయగా
శక్తికి మించు దానమిడి ♦ సేమముగూర్ప దలంప, వారలే

యుక్తిని బాధ జేతురిక ♦ నుర్విని, నీదగు దానబల్మిచే
భక్తికి బొంగిపోయెదవు ♦ భంగమునీకవె, శారదాపతీ॥ 30

ఉ॥ ధాతవునీవయౌదు, విక ♦ దానములద్భుతమౌనుగాదె, నీ
చేతనుమించనిచ్చి, మరి ♦ జేయునదేమియు లేక చింతచే
నాతురతన్ గృశించెదవి ♦ కావిధిగష్టము పొందుచుందు, నీ
నీతము లెంతవింతయొకొ! ♦ నీకదె సౌఖ్యము, శారదాపతీ॥

చ॥ అతులితభోగభాగ్యముల ♦ నందఁగరున్ గలుగంగఁజేసి, నీ
యతివకు శారదాంబకొక ♦ యందవు, తంబురకొయ్య నేగదా!
సతతము బాడుకొమ్మనుచు ♦ సంతసమొప్పగనిచ్చినావు, ని
వితరణమొంతగా బొగడ ♦ వీలగునీభువి, శారదాపతీ॥ 32

ఉ॥ ఇచ్చిన కొయ్యగైకొనుచు ♦ నింపుగి దృప్తినిబూని, యామె
నిన్ । మెచ్చుచు బాడుకొంచు నిను ♦ మెచ్చగచేయును;
యద్దియేగదా! । యిచ్చినదానికిన్ ఫలిత ♦ మీకిక్రియ
జల్పుట! తృప్తినొందు, నీ । నెచ్చెలినిన్ను మించె, యిక, ♦ నే
మని వేడుదు? శారదాపతీ॥ 33

ఉ॥ తీరికనుండవీ వెపుడు ♦ దేశపరిస్థితి చింతనంబుచే
గోరవు సౌఖ్యమేదియును ♦ కూరిమి సత్యసులోకపాలనం
బారయ జేయుచుండెదవ ♦ హర్నిశమున్ కమలావరాం
ఘ్రిసే । వారతినుండు నిన్నుగద ! ♦ భక్తుడనందగు
శారదాపతీ॥ 34

ఉ॥ నిద్దురహారముల్ విడచి ♦ నిత్యమునీదగు కల్పనావిధా
బద్ధిర! చేయుచుందు, వది ♦ యబ్బురమాగద నీదుదీక్ష! నీ
గద్దియవీడకుండగను ♦ గాసిలిజెందక వ్రాయుచుండెదో,
తద్దయువేడ్క-నీకదియె ♦ తథ్యము, నిత్యము, శారదాపతీ॥

ఉ॥ వేదములన్ బఠించుచును ♦ వేడ్క-నుబొందెద వెంతవింతయో!
బాధలు లేవునీకికను ♦ భారతినీవటు ప్రేమ జూచు లే
భేదమనంగబోవు, భువి ♦ బీదలపాలిటి కల్పభూజమై
బాధలనెన్నొ యోర్చెదవు ♦ భావముదిట్టము, శారదాపతీ॥

చ॥ చదువులు పెక్కు-నేర్చితివి ♦ సాహితికన్యవరించెనిన్ను, నీ
చదువిల యెంతవింత! కను ♦ చక్క-ని భాషకునన్నె దెత్తువే
విధినిక నీదుకల్పనల ♦ వేమరు వర్ణన జేయగల్గుదునే
మది దలపోయనీమహిమ ♦ మానితమోగ్యము శారదాపతీ॥

ఉ॥ అర్థముగోరవయ్య పర ♦ మార్థమె, జీవనమందువయ్య, నీ
స్వార్థముగోరకే, మఱియు ♦ సౌఖ్యముగోరకెమించుకాలమున్
వ్యర్థము జేయవయ్య మరి ♦ యా, కల, మద్దిర! వీడవయ్య. నీ
స్వార్థపరిచ్యుతీ, యిలను ♦ జక్క-గనున్నది శారదాపతీ॥ 38

ఉ॥ హారమనంగబోవ, విక ♦ నన్యులభాషలనాలకింప, వే
వేరెఘనంబుగోరవుగ ! ♦ వింతగునీచరితంబుజూడ, నీ
శారదకన్యకన్ దరిని ♦ జక్క-గ జేర్చుక ముచ్చటాడుచున్
సారసుగీతమెప్డు, మన ♦ సారగ గ్రోలెదు, శారదాపతీ॥ 39

ఉ॥ చిక్కిన భక్ష్య భోజ్యముల ♦ సేమముగా భుజియింప
గల్గెదా। అక్కట! లేనిచో లవణ ♦ మన్నమె ప్రీతిభుజింప
నెంచెదా। చక్కని పాన్పు లుండినను ♦ సంతసమొప్ప
సుఖింపగల్గెదా। నిక్కము,చిక్కకున్న, ధర ♦ నేస్థలినేని సు
షుప్తి జెందెదా। మక్కువ నివ్విధిన్ భువిని ♦ మాన్యత
నొందెను, శారదాపతీ॥ 40

ఉ॥ భూషలగోరి నెప్పుడును ♦ పొందుగ జ్ఞానసుభూష దప్ప, యే
వేషము గోరనీభువిని ♦ నీకనుసత్య సుభాష దప్ప, యే
యాలసనొందబోవుగద ♦ యార్యహితంబగువృత్తి దప్పనం
తోషము నొందుదీవు, బుధ♦తోషిణ, భూషణ, శారదాపతీ॥

ఉ॥ ధర్మసుకర్మ రక్తియు, ను ♦ దారగుణా న్వితభావరక్తి, యే
మర్మము లేకభక్తులను ♦ మన్ననజేసెడు మాన్యమూర్తి, హే
నిర్మలకీర్తివంత, బహు ♦ నీతిసుశోభిత సత్యమూర్తి, స
త్కర్మ సుమార్గవర్తి, సిత ♦ కాంతిశుభప్రద, శారదాపతీ॥

ఉ॥ నీరజనేత్రనాకొసగు ♦ నెమ్మనమందున దృప్తి, భక్తియున్
శారదగానలోల, తను ♦ సౌఖ్యములొందగజేసి, యీభవో
ద్ధారణ జేయ వేడెదను ♦ దాతవు, తల్లివి, తండ్రివీవె, నా
నేరక జేయు తప్పులను ♦ నీవె క్షమింపగ, శారపదాతీ॥

ఉ॥ చిన్నతనంబునుండి, నిను ♦ జేరి, స్మరించుచునుంటిగాదె; యా
పన్నశరణ్య! కారడవి ♦ బాదముసాగభయంబు నొంది యే

తెన్నునుగానలేక, కడు ♦ తేకువదప్పిన పాంథుకీతి గా
నున్ననవెట్లు బ్రోచెదవొ! ♦ యోకరుణానిధి! శారదాపతీ!

శా॥ నాకాంతుండవు నాసుబాంధుగురుఁడౌ ♦ నాతోడు నానీడ,
వం! చే కాలంబున గూర్మినిన్ దలచెద♦ న్నీవే శరణ్యంబు
నన్! నీకన్ బ్రోచి, సుభాగ్యమీయు, మదియే♦ వేవేలు,
నాకిచ్చుటల్! శ్రీకారుణ్యపయోనిధీ గుణనిధీ♦ శ్రీశార
దాంబాపతీ॥ 45

ఉ॥ దూషణజేసితంచు, నను ♦ దూఱగబోకు, త్వదీయభక్తినే
వేషమువై చియుండిసను ♦ బ్రీతియొ, నీకది, సంతసంబె వే
భూషలనిచ్చినట్లు మది ♦ బొంగెదనీదగు ప్రాపుగల్గ, వే
భాషలికేల? నిన్వినయ ♦ భక్తినిగొల్చెద శారదాపతీ॥ 46

ఉ॥ కామము, క్రోధలోభముల ♦ ఖండనజేసి, త్వదీయభక్తిమై
ప్రేమజెలంగజేసి, కడు ♦ పెంపున దీనజనావళిన్, సదా
నీమముతోడ జూచి కడు♦ నేర్పునబ్రోచి, నయంబుగూర్చి ని
ష్కామమనంగనిచ్చుబోడ♦ గాంచగనీగదె! శారదాపతీ॥ 47

చ॥ వినుమికనీవుపల్కునది ♦ వేదము, పాడగగీతమౌని, కే
మనదగునీకుచైదముల ♦ వన్నియుసృష్టికి కల్పనంబులే!
కనగల వింతలన్నియును ♦ గాంచగనీకడనున్నవయ్య! నీ
వనునదియాటయౌను, మరి ♦ పాడగ, పాటయొ,
శారదాపతీ॥ 48

ఉ॥ ధనయుతసౌఖ్యసంపదలు♦ తండ్రులుతాత సతీయుతంబులై
యెనగల సౌఖ్యమొందగను ♦ నెన్నగవారి యదృష్టమం
దురే! । తనమది చింతగల్గినను ♦తప్పగ ధాతయె వ్రాసెనం
చురే! । మనుజులకోర్కెలేక, ఘన ♦ మాన్యులనందురు
శారదాపతీ 49

[illegible] లేఖనము ♦ [illegible], మార్పులజేయనంచు!
[illegible] చేసినను♦కోరిభజించి, నుతించి, పిల్చి
నన్ । యె [illegible] కట్టి వ్రాసినను? ♦ యెంచగ లేఖినిచేతిలోనిదే
పొందుగమార్పు [illegible] ♦ పుణ్యసుశోభిత శారదాపతీ॥

। నిన్నులవేడనేమి ఫల ♦ నీయము? జేసెదుగాని కల్పనల్
మన్ననజేసి వేడినను ♦ మార్తువ? గూర్తువ? నీదువ్రాతలన్
నిన్నడుగంగబోనికను ♦ నీకికనచ్చినరీతి వ్రాయుమా
చెన్నుగ నీదులోకమున ♦ సేమముగాంచుమ, శారదాపతీ॥

॥ వ్రాసినవ్రాతమార్తువను ♦భ్రాంతియొకింతయు లేదునాకునా
యాసను గొల్వగాదగిన ♦ యాశ్రితపోషకుడీవుగావు, నీ
వేసముమార్చి, లేఖినికి ♦ వింతగనీవిక గ్రొత్తవ్రాత, లా
వేశము జేయకుండగను ♦ వేడుదునిన్నిక, శారదాపతీ॥ 52

॥ కలుములు లేములున్ మొదలు♦గాగలసీదగు కల్పనంబులన్
బలువిధ వైపరీత్యములు ♦ పల్మరు గన్పడుచున్నవే! సదా
సలుపగనిట్లునీకదియె, ♦ సంతసమా? తగుధర్మమార్గమా ?

తెలియగ జెప్పుమందుమని ♦ తేలిక జేసెదమంచు, నీవిటన్
జెలువుగగానిపించవుగ! ♦ చిన్నతనంబొ! భయంబొ!
చింతయో!॥ నిలబడి చెప్పుమా, యికను♦ నీవెటుబోయెదు?
శారదాపతీ॥ 53

చ॥ ఇలగలమందభాగ్యులకి ♦ కేమియు జేయగలేక, నింక, తా
మలసత జెందకుండగను ♦ నాసలగల్పన జేసి యిచ్చెద
గలుగును ముందు నీకనుచు ♦ గల్గునొ గల్గదొ! నీవు
మాయలట! తెలియగ నేరి శక్యమగు ♦ దెల్లము సేయుము,
శారదాపతీ॥ 54

చ॥ కరుణయొకింత లేక, యవు ♦ గాదను యోచన సుంత లేక, భా
సురమతి వెల్వబోక, మది♦ నొప్పుగ్రహింపగ పిలునీకయే
మరువున డాగియుండెదవొ!♦మారర, సుధీవవర! భక్తకోటినీ
వరమర జేయుచుంటి విక ♦ నాదరముంచక శారదాపతీ॥

చ॥ పిలచిన బల్కకుంటివిక ♦ వెక్కగు బాధల జిక్కియుంటివో
సలుపగ సాయసంపదలు♦ సాయమి కెవ్వరు లేక, నొంటరిన్
సిలుగుల జెందుచుంటివొకొ!♦ జేసెడి దేమియు లేక, లేనిచో
తలపగ భక్తురాలిపయి ♦ దప్పుల నెంచితొ శారదాపతీ॥

చ॥ కనబడ ప్రేమపాశముల ♦ గట్టిగకట్టెద నంచు నెంచితో?
వనరుగనీవు చిక్కినను ♦ వంచన జేసెద నంచు నెంచి, నీ
మనమున చింత జేసితివొ! ♦ మన్నన జేయక భక్తి పీడితం
చనువుగ జెప్పుమీవికను ♦ నాదర మొప్పగ శారదాపతీ॥

ఉ॥ ధాతవు, నీవు వ్రాసినది ♦ తప్పకమార్పనటంచెరుంగుడున్
నేతవుగాన, భావివిధి ♦ నేనియు నేతగఁగోరి నట్లుగాఁ
నీతము సేయుదంచు, కడు ♦ నేర్పున వేడితి, జూపి తీవ్రతన్
బ్రీతిని వేడుభక్తుకది ♦ ప్రేమసుభావము, శారదాపతీ॥ 58

ఉ॥ తీవరభావమున్ గనుర ♦ దీవ్రతజూడకు ధీవిశారదా
యేవగనైననన్ దరిని ♦ నేపుగఁ జేర్చెద వంచునంటిగా
నీవతిధర్మశీలుడవు ♦ నియమముదప్పవు, నేనెరుంగుదున్
యేవిధినైనగాని సుఖ ♦ మేర్పడ జేయవె ! శారదాపతీ॥59

చ॥ పతియును నీవటంటి గురు ♦ బంధువునైనను నీవెయంటి,
నా। గతియిలనీవెయంటి, నను ♦ గావగభారమునైచి
యుంటి, నే।నితరులనైనమంచనను ♦ యింపుగ సొంపుగ
జూతువంచు, నే। సతతము నమ్మియుంటి మది ♦ సత్యని
వాసుడ! శారదాపతీ॥ 60

ఉ॥ భాషవునీవె యౌదు, మరి ♦ భాషితుడీవెయౌదు, సం
తోషివినీవెయౌదు సుఖ ♦ దుఃఖము సౌఖ్యములీవెయౌదు.
వీ। వేషములన్ని నీవె, పెర ♦ వేసములెవ్వియు నీకు లేవు వే.
భాషలనంగనేల ? విను ♦ భాగ్యములీయవె! శారదాపతీ॥

ఉ॥ భోగియుత్యాగియున్, మరియు ♦ పొందుగ గష్టసుఖంబు
లీవె యౌ।రాగవిరాగముల్ గనగ ♦ రమ్యంబసీకడ నొప్పా
చుండుగా। యోగము, మానివీవె, యిక ♦ నెంతయు కీడును

మేలునీవె, నే । సాగిలి మ్రొక్కెదమాటికి, నిను ♦ సన్నుతి
జేయుచు శారదాపతీ॥ 62

చ॥ ప్రవిమల నీతిశాల బుధ ♦ పండిత భూషణధర్మపాల యో
కవివర సత్యశీల ఘన ♦ కంజదళేక్షణ గానలోల హే
భవహర పుణ్యశీల రవి ♦ భాసుర తేజ ముకుందలోల నీ
న్నవిరత భక్తిగొల్చెద ని ♦ కన్యముగోరను శారదాపతీ॥

చ॥ అచలచరాచరంబుల వి ♦ యన్నియు నియతి చేతివంచు నీ
సచివులు వల్కె విందునిక ♦ సంతతమీ జగమంత నీవె ని
వచనము వీనులంబడ, న ♦ వారిగిగోరనగాని రావె ని
వెచటెటులంచటన్ జరించెదవొ ♦ వేగర జెల్పుము శారదాపతీ॥

ఉ॥ నిదగనీమ మెన్నడును ♦ నేరదుతప్పగనంచు నందు, రే
వాదములేకయే భువిని ♦ వానిని నమ్మగలేను నేను నీ
మోదమదెట్టిదో మదికి ♦ ముందుగభావనలేక యుంటచే
మేదిని నీప్రభావమగి ♦ మిథ్యయొసత్యమొ! శారదాపతీ॥

చ॥ పదముల శూద్రవంశజులు ♦ బాహువులందున క్షత్రియా
న్వయుల్ ।కుదురుగవైశ్యులూరువుల ♦ గూర్మిముఖంబున
బ్రాహ్మణోత్తముల్ । వదలకనోట వాణినిలు ♦ వంగనశక్తు
డవౌదుపల్క, ని । న్నెదదిలపంగినేమి ఫల ♦ మిచ్చెదు,
చేసెదు, శారదాపతీ॥ 66

ఉ॥ శ్రేయముగూర్తువంచు, కడు ♦ శ్రీలను గూర్చెదరోపకార
ముల్ । కాయమునోవ్వనోర్చి, ఘన ♦ కర్మలు! భూతద

యాదికృత్యముల్ । జేయుదువంచు బల్కెదరు ♦ జేసిన నేవి
ఘనాదికార్యముల్ । వేయన నేల? నీపగటి ♦ వేషము లేటికి
శారదాపతీ॥ 67

ఉ॥ ఆయికరుంగ వేడ, మది ♦ రాజసమా, యసమానకార్య
మా । వ్రాయగజాలవేవె? ఘన ♦ రంజితసౌఖ్యములీయ
లేవె? నీ । తీయనిపల్కులన్నియును ♦ తేనియలొల్కు,
క్రియ:బుశూన్యమా । మాయలికేల నాకిడను ♦ మాన
మదేలను, శారదాపతీ॥ 68

సీ॥ చేరినీదరినాదు ♦ చింతవెల్పగ, వ్రాత,
కొంత చాలించి, నా ♦ గోడువినవు
ఏకాంతముననిన్ను ♦ నేదేనిగోర, నా,
పాతచిట్టాలన్ని ♦ బయటబెడుదు
నీపాదములనైన ♦ నెమ్మిబట్టెదనన్న,
మింటకంటనుజూడ ♦ కంటబడవు
నీకొగంటినే ♦ నేగుదేరుదమన్న,
నిండుగానొకచోట ♦ నుండవీవు

గీ. పరగ బ్రహ్మాండ మంతనీ ♦ పరమెయైన
నాకునీవల్లగలిగెడు ♦ నయమదేది?
కంఠశోషమె చూడ, నా ♦ కక్కటియెతప్ప
శారదాధీశ, జగదీశ ♦ స్వప్రకాశ॥ 69

ఉ॥ ఆడినమాట దప్పవని ♦ యందఱునందురుగాదె, నిన్ను నీ
పోడిమిసత్యమెట్లగును?♦పూర్తిగమోసము పుచ్చితేనమున్
వీడనిభక్తినుండినను ♦ వేడుకవీడి, చరించి, వెండి నీ
వేడను గావరావుగద! ♦ యేదయసత్యము? శారదాపతీ॥70

చ॥ ఇరువది వత్సరంబులెటు ♦ లెట్టులనో! భువినెట్టగల్గితీ
వరకుసుఖంబు లేదుగద! ♦ భావమునందిక గోరబోనికే
వరముల గోరబోను, నిజ ♦ పాదసరోజము లాశ్రయింపగా
వరమొకటేను గోరితి కృ, ♦ పామతి నీగదె! శారదాపతీ.

చ॥ గతదివసంబులన్ని వృధ ♦ గా వెలిబుచ్చితినయ్యొ, వెఱ్ఱినై
పతితులపాలి బాంధవుడ ♦ పారదయామతివైననిన్ను నీ
క్షితితల జంతుజాలముల ♦ సేమముగూర్చు విధాతవంచునే
మతిదలపోయనైతి మతి ♦ మాలితినీవిధి శారదాపతీ॥ 72

చ॥ వినయవిధేయతావిరుల ♦ వేమరుతావక పూజసల్పెదన్
గను, మనురాగచందనము ♦ గ్రన్ననినీమెయినిండపూతునె
మ్మనమున భక్తి పెంపుగని♦మన్ననతో భజియింతునిన్నునా
ఘనతరపాపపుంజమన ♦ ఘాత్మ! నశింపదె? శారదాపతీ॥73

చ॥ ఒకపరిచింతజేయ,దురి♦తౌఘములన్ని నశించి, సౌఖ్యముల్
సకలముగల్గునంచు సర ♦ సజ్ఞులువల్కగ నిన్నునమ్మి, వే
రొకనిభజింపనైతి, యిక♦నూరకనుండుట నాయమానొకో!
బకగతిధ్యానమున్ సలుపు ♦ పాపులకిచ్చెదో! శారదాపతీ॥

కావు నే । విరివిసుఖంబుగోరనిక ♦ వేడుక మానసమంది
దృష్టి నీ । చరణయుగంపు సేవలను ♦ సంతతమీగదె
శారదాపతీ॥ 84

శా॥ నానాదేశములన్ జరించితిమి నా ♦ నావిద్యలార్జించినా
మేనాడేని దయామయుండు మనెన్ ♦ సేవారిగా జూచున
చానందంబునబొంగి నారమిక నా ♦ యాశల్ నిరాశల్ గదా!
షోనీ మానసమందు జింతగొనకే ♦ పూజించుచున్ మాధ
వున్ । నేనేమీ మది గోరనంచుగననా ♦ నిష్కామకర్త
వ్యమున్॥ 85

ఉ. సంతతసత్యనిష్ఠను బ్ర ♦ జాహితుడైనను భక్తుడైన వే
దాంతియునైన యోగనియ ♦ మాత్మకుడైనధనాఢ్యుడైన
దా । శాంతిని వీడియున్న తను ♦ సౌఖ్యములేదు జయంబు
నొందగా । సంతతమాత్మశుద్ధియును ♦ శాంతియునీగదె,
శారదాపతీ॥ 86

ఉ. నీదగువిద్యజూడ ధర ♦ నీన్ మణులట్లు వెలుంగజొచ్చె నే!
నీదుముఖాంబుజద్యుతుల ♦ నేకములైదిశలందు గ్రమ్మె నే!
నీదుదయాలసద్గుణులు ♦ నిండుగ నీజగమంత బ్రాకెనే !
నీదగుకల్పనావళుల ♦ నేరను జెప్పగ శారదాపతీ॥ 87

చ. అనయము మోహసాగరము ♦ నందునజిక్కి నీదురూపు నా
కనులను గాననేరకయె ♦ కలజగంబె నిజంబటంచు నే

నిను దలపోయనైతి రమ ♦ ణీయతరంబగు నీదుపాదముల్
వినుమిక బట్టితిన్ విడను ♦ నీడను నేనిక శారదాపతీ॥ 88

చ. శరణిదె శారదాంబనుత ♦ శంకరమిత్ర ప్రశాంతమూర్తిశ్రీ
వరకరుణాలవాల! కర ♦ పద్మయుగంబులభక్తిమోడ్చి నీ
చరణయుగంబు లంటగను ♦ స్వాంతమునందు భజింతు నే
నితః। పరము లెటులుంగ దీనజన ♦ పాలకవింటివె! శారదాపతీ॥

ఉ॥ కంటి భవత్స్వరూపమును ♦ గంటిని నీప్రభ నీమహోన్నతుల్
గంటిని నీవిలాసముల ♦ గంటి కనున్గవదృప్తిదీర ము
క్కంటికినైన నిన్నుగన ♦ గా తలపోయగ శక్యమౌనె? పా
ల్గంటి సరస్వతీకృపను ♦ గంటిని ధన్యను శారదాపతీ॥ 90

చ॥ వ్రతములసల్పుకొంటె నుప ♦ వాసములన్ దగసల్పుకొంటెస
ద్గతులకు తీర్థయాత్రలను ♦ గౌరవ మొప్పగ జేయుకొంటెనూ
నితమగుమానసంబు గడు ♦ నిర్మలినంబుగనుంచి పూతలై
సతతముసంచరింపగను ♦ స్వర్గమదేగద ! శారదాపతీ॥ 91

ఉ॥ చంద్రుడవౌదుతేయు జల ♦ జాప్తుడవౌదు పవళ్ళయందు మా
హేంద్రుడవౌదు వృష్టికి మ ♦ హిన్ జరియింతు సమీరవృత్తి
నా। సంద్రములందునీవె సర ♦ సంబగు వాక్కులయందునీవె
రా। జేంద్రుడవీవె భూతలము ♦ జేతధరించితి శారదాపతీ॥ 92

చ॥ తెలియగనామశక్యమె? సు ♦ ధీవరులే గ్రహింపలేరుగా!
తెలియవ నీమప్రజ్ఞలు న ♦ దీతటమందు వశించుకప్పలన్

గలుగులనుండుచీమలను ♦ కంటికి తెప్పగ గాంచి హారమున్
దలపగ నిచ్చెదీవు దయ ♦ తప్పవు దాతవు శారదాపతీ॥ 93

చ॥ ఘనతరమైన యీ భరత ♦ ఖండమునన్ జననంబొసంగి నా
తనువు తరింప తీర్థసము ♦ దాయములన్ భ్రమణంబొసంగ ని
చ్చను పునొసంగి నన్ను సర ♦ సంబగు వాక్కుల ధన్యు జేసితో
యనఘ! త్వదీయ దివ్యపద ♦ నాశ్రయమిచ్చితి శారదాపతీ॥ 94

చ॥ వరలగ సత్యమార్గమున ♦ వాసిగ శాంతవిభూషితాత్మునై
వరలగ నిత్యసౌఖ్యముల ♦ వర్ధిలగా సమభావునై సదా
సరలగ సత్త్వమార్గమున ♦ భావమునన్ నిను గొల్వ నెల్లెడన్
వరములనిమ్ము వేగ భవ ♦ బాధవిమోచన శారదాపతీ॥ 95

చ॥ పరదయ, బంధుసేవలును ♦ భ్రాతృలభక్తి స్వదేశసేవలున్
సరసపురాణపాఠముల ♦ సారములన్ గ్రహియించుచుండు
టల్। వరుసగ నీదు కీర్తనల ♦ బద్యముఖంబున బాడుచుండుటల్
సరగున గూర్పుమయ్య నిను ♦ సన్నుతి జేసెద శారదాపతీ॥ 96

చ. అజ! పరమాత్మ! కృష్ణ! నిట ♦ లాక్ష! రమేశ! వసుంధ
రాధిపా!। సుజనవిలోల! ధీజనవ ♦ చోనుత! ధీయుత!
దీనపోషకా!। కుజనలతాలవిత్రి! సుర ♦ కోటి సురక్షక!
యంచు నిన్ను నే। భజనలు సల్పుచుందు బహు ♦ భంగుల
బిల్చుచు, శారదాపతీ॥ 97

చ. హారివరపుత్ర! పాప పరి ♦ హార! మహేశ! విదేశబాంధవా!
వరకరుణాలవాల! సుర ♦ వందిత! భవ్య!ముకుందలోల! నీ
చరణసరోజమందు మధు ♦ సారము గ్రోలుటకెల్లప్రొద్దు
లన్। స్థిరతనొసంగి నాహృదయ♦సీమవసింపుమశారదాపతీ॥

చ. చదువులతేజునీవె సర ♦ సజ్జులకీభువి రక్ష నీవె నా
హృదయమునందు నిల్చుకొని ♦ యెల్లెడ నిన్ భజింయింపు
చుంటినన్। వదలక క్షీరనీరసమ ♦ భావముగా మదినుంచు
కొమ్మ నీ। పదముల వీడనెప్పుడును ♦ భద్రమటంచును
శారదాపతీ ॥ 99

చ. శారదకాంత నీమపద ♦ సారస యుగ్మముమ స్తకంబునన్
గోరి ధరించుచుండు, నిక ♦ గోరికదీరగనాత్మలోన, నిన్
జారుతర ప్రశాంతమున ♦ సారసుగీతముబాడుచుండు న్నో
నీరజనేత్ర! ప్రీతి గరు ♦ ణింపుమ వేడెద శారదాపతీ॥100

# శ్రీ జొన్నలగడ్డ శారదాంబ.

శ్రీ

# లక్ష్మీశారదా శతకములు

## చాటుపద్యములు



### నిష్కామయోగము.

సీ॥ రాజ్యంబు నీ కేల ♦ రమ్యమౌ నీ మనో
రాష్ట్రంబునకు నీవు ♦ రాజుగాగ
భూషణంబులవేల ♦ భూరిగుణాంచిత
స్వాంతమౌ కారుణ్య ♦ వాంఛగల్గ
చీనాంబరములేల ♦ శృంగారముల నీయ
శాంతి సుశీలతల్ ♦ కాంతినీయ
బహుళభాగ్యములేల ♦ పరమపవిత్రమౌ
మానసంబున తృప్తి ♦ మహిమనీయ

గీ॥ సత్యసౌభాగ్యములుగల్గ ♦ జంకదేల
ధర్మమార్గంబుగల్గిన ♦ దర్పమేల
సాధువర్తనగల్గిన ♦ సంపదేల
నిర్మలంబైన మతిగల్గ ♦ నితరమేల॥

ఉ॥ అంచితకీర్తియున్ ఘనధ ♦ నార్జనయున్ బహువేష భాష లుగ॥ ఎంచగభాగ్యముల్ మనయ ♦ భీష్టములాయవి? కావు కావు, ఓ॥ సంచితపూర్వపుణ్యభవ ♦ సంచితలోకమును ద్ధరించుటే॥ యంచితమైన యాశయము;♦అయ్యది నిత్యము గాంచుచుండుమిా॥ 2

సీ॥ చీనాంబరములేల ♦ శృంగారములవేల
శీలమే సొగసౌను ♦ చెలియలార
హెూన్ను సౌఖ్యములేల ♦ హేమ సౌధములేల
సత్యమే జయమిచ్చు ♦ సఖియలార
చక్కదనంబేల ♦ చాలగా ధనమేల
సౌభాగ్యమున్నదో ♦ చానలార
నగలునాణెములేల ♦ నాజూకు లవియేల
సంయుమైన సద్విద్య ♦ నియతియున్న

గీ॥ మహితగుణయుత భారత ♦ దుహితలార
పూతకాంతలు పుట్టిన ♦ భూమియందు
జనన మొందితిమిల భవ్య ♦ చరితలార
వాసిగాంచుడి యోకీర ♦ వాణులార. 3

—♦ సీ స మా లి క ♦—

కామాంధకారంబు ♦ కడజేయగాజాలు
జ్ఞానదీపంబు సు ♦ జ్ఞాని యొసగె

క్రోధానలంబార్ప ♦ నాధారభూతమౌ
శాంతోదకముల శ్రీ ♦ కాంతుఁడొసఁగ
లోభకల్మషముల ♦ ప్రాభవంబడఁగ
విభుఁడిచ్చె సన్మార్గ ♦ వీవనలను
మోహసాగరమీఁద ♦ మోక్షదాయకుఁడె యు
ద్ధరణిసంతుష్టినా ♦ తరణిఁజూపె
మదమత్సరాభ్రనా ♦ మస్వరూపము మాప
నిత్యుఁడాశమదమా ♦ దిత్యునిచ్చె
పాపభుజంగమ ♦ వ్యాప్తినిట్లడఁగ
నిండుగా నివియె ధ ♦ ర్మాండజములు

గీ॥ కామలోభాదిశత్రుల ♦ కావరమును
దరుమఁగాజాలిమనలకా ♦ ధారమగుచు
శత్రునాశకపటుదివ్య ♦ శస్త్రచయము
నవనివిభుఁడిచ్చెగైకొని ♦ యశముగనుఁడీ 4

సీ॥ శీతోష్ణములకోర్చి ♦ ప్రీతితోవృక్షముల్
సర్వజీవములకు ♦ సౌఖ్యమీదె!
దీపంబుతావెల్గి ♦ తేజంబుమనకీదె
భస్మమౌటకునైన ♦ బరగనోర్చి
ధరకష్టమెంతైన ♦ దాల్మిదాల్చియుతాను
జగతిరక్షింపదే ♦ జననికరణి

మలినంబులను గంగ ♦ మహిమతోఁ గైకొని
తేటనీరీయదే ♦ తెరువరులకు

గీ॥ కష్టములనెన్ని గనినైన ♦ కనలినైన
నుపకృతులుజేయుటేగద ♦ యోర్పుబలిమి
సర్వసిద్ధులమెసగంగ ♦ సాధనంబు
నగియెనిష్కామకర్తవ్య ♦ మనగబరగు॥ 5

సీ॥ ఆపదలొదవిన ♦ నతిధైర్యమును బూని
కష్టంబులనుదోల ♦ ఘనముగాదె
దుఃఖవార్తలవిన్న ♦ దుఃఖమేమియుగొనక
మదిదిట్టముగజేయ ♦ మహిమగాదె
దారిద్ర్యజలధిలో ♦ దారిగానకయున్న
ధరవలె నోరిమి ♦ దాల్పదగదె
రాగివైయుండియును ♦ రాగంబులున్నను
లోలత్వమునుజెంది ♦ లోబడకుము

గీ॥ అంటి యంటక నుండుమీ ♦ యవనియందు
అదియె ధర్మంబు సేమంబు ♦ లనగబరగు
ఇహపరంబుల సుఖముల ♦ నియ్యగల్గు
ఘనతరంబగు కీర్తిని ♦ గలుగజేయు॥ 6

సీ॥ రాజ్యంబు వీడియు ♦ రఘురామచంద్రుండు
పితృవాక్పాలనం ♦ బెలమివిడెనె?

భాగ్యముల్ గోల్పోయి ♦ బహుకష్టముల బడియు
ధర్మాంబుఁ వీడనే ♦ ధర్మసుతుడు
కాంతారమరిగియు ♦ కడగండ్లబడియును
నిషధేశ్వరుడు సత్య ♦ నీతివిడెనె?
సతినమ్ముకొనియైన ♦ సుతుగోలుపోయిన
బొంకులాడెనె యాత్రి? ♦ శంకుపట్టి?

గీ॥ ధర్మమేజయమానుగా ♦ ధరణియందు
సత్యమే కాంతినొసగును ♦ తథ్యముగను
శాంతమే భూషణంబయి ♦ శాంతినొసగు
ఓర్పుదాల్చిన గష్టముల్ ♦ మార్పుగనును॥ 7

సీ॥ చక్షురింద్రియముల ♦ నిక్షేపమునుగన్న
కుక్షిలో నాసక్తి ♦ గూడదెపుడు
అనుచితంబుగ కీర్తి ♦ నాశింపగారాదు
ఘనమైన సన్మార్గ ♦ కాంతిదప్ప
పరులాపదలయందు ♦ బరుచుగుందుచునున్న
వైరియాపదలైన ♦ బాప జనుడి
శరణుజొచ్చినవాని ♦ బరగరక్షించుచు
నాదరింపుమ సుతుని ♦ మాదిరిగను

గీ॥ ఇట్టి సద్గుణంబులుగల ♦ యట్టివారె
ఇహపరంబుల సౌఖ్యంబు ♦ నెలమిగాంత్రు

శాశ్వతానంద మదెగాదె ♦ జనులకరయ
గానగాంచుడి జనులార ♦ ఘనపథంబు॥ 8

సీ॥ నిర్మలంబగు చూపు ♦ నిత్యతనుగనంగ
నిక్షేపమైననీ ♦ యక్షియుగము
సత్యసద్భావనల్ ♦ నిత్యాత్మ బాగడంగ
నింపుగాబల్కు జి ♦ హ్వేంద్రియములు
సంగీత సాహిత్య ♦ సత్కథల్ వినుటకై
అందమౌనీమ శ్రో ♦ త్రేంద్రియములు
సతతంబు విమలమౌ ♦ సన్మార్గమున బోవ
నేర్పైనఘ్రాణ స్ప ♦ ర్శేంద్రియములు

గీ॥ సర్వరక్షకుడిచ్చెగా ♦ చక్కగాను
అట్టిపంచేంద్రియంబుల ♦ దిట్టపరుప
నదియెగా బ్రహ్మచర్య ♦ మీయవనిలోన
దానిగాంచుచు ధరణిని ♦ ధన్యులగుడు॥ 9

గీ॥ కల్మషమ్మైన చూడ్కుల ♦ గనగరాదు
దుష్టవార్తలవినకర్ణ ♦ దూరులగుడు
నిందవాక్యంబుదుర్బుద్ధి ♦ నెందుపలదు
మందబుద్ధినియజ్ఞాన ♦ మొందవలదు
అవయవబ్రహ్మచర్యంబు ♦ లనగబరగు
నిండునిష్కామ కర్తవ్య ♦ నియమమిదియె॥ 10

సీ॥ కష్టంబులకునోర్చి ♦ నిష్ఠమానక చిదా
నందంబునొందుటే ♦ యందమౌను
తనకష్టముల్ మది ♦ గొనకనే సువిశాల
దృష్టితో నితర స ♦ ద్గోష్ఠిగనుట
సన్మార్గమును సదా ♦ సాధించుచో గల్గు
కష్టముల్ భరియించ ♦ శ్రేష్ఠమదియె
అష్టకష్టచయంబు ♦ లానందమని యెంచి
మహిని శాంతినిగంట ♦ మహిమగాదె

కం॥ అలనలసుమతి హరిశ్చంద్రులు ♦ లలనలుగూడను
ఇష్టసిద్ధికినైగాదె ♦ కష్టపడిరి
క్రీస్తు బుద్ధమహాత్ములు ♦ కీర్తిగనరె
కష్టములకోర్చియే తమ ♦ నిష్ఠగనిరి॥ 11

సీ॥ పతిపీడ యిడుమల ♦ బడుచుగడుపుచున్నైన
పతిభక్తి వీడెనే ♦ పడతి సీత
దవవహ్నిబడనైన ♦ ధవునివిడిపోయినా
సత్యంబువిడెనొకో ♦ చంద్రమతియు
విభుడు తన్నడవిలో ♦ విడనాడిపోయిన
వీడెనే ధైర్యంబు ♦ భీమతనయ
ధవుప్రాణమును యమ ♦ ధర్మరాజుగొనంగ
విలపించెనొకో సా ♦ విత్రిదేవి

గీ॥ అట్టికాంతామతల్లులు ♦ బుట్టినట్టి
భరతఖండంబునందున ♦ బరగబుట్టి
ఎట్టిధన్యులమైతిమో ♦ యెరుగవశమె
అట్టి కీర్తిని గాంచుడీ ♦ యమ్మలార॥ 12

సీ॥ లక్షాధిపతికైన ♦ భిక్షాధిపతికైన
రాగికైనను యోగి ♦ రాగికైన
అనఘాత్మునకునైన ♦ ఘనపాపమతికైన
నిత్యసత్యవ్రత ♦ నిరతుకైన
పుణ్యపురుషునకైన ♦ భూపాలునకునైన
బీరుకైనను మేరు ♦ ధీరుకైన
సుందరాంగునకైన ♦ మందభాగ్యునకైన
విద్వాంసునకునైన ♦ వెడగుకైన

గీ॥ మందిరమునుండి సంపద ♦ లందుచున్న
బహుళపరివారయుక్తుడై ♦ బరగియున్న
కాననాంతరముల కేగి ♦ కాపకున్న
తప్పునే మృత్యువేరికి ♦ ధరణియందు॥ 13

మానవుపూర్వకర్మములు ♦ మారుపుగల్గున ధాత్రవ్రాతకున్
కానను డాగియుండినను ♦ కష్టదినంబులు పీడగల్గునా
మానసమందు చింతగొన ♦ మానునకల్మలు లేములీయెడన్
మానవుడెంతగఱతనువు ♦ మన్నగబొంచిన నిత్యముండునే॥

సీ॥ నిత్యసత్యవ్రత ♦ నిష్ఠచేగాంచె, ని
శ్చలకీర్తి, యాహరిశ్చంద్రుడవని
ధర్మసత్పాలనా ♦ తత్పరుండై గాంచె,
ధర యశశ్చంద్రికల్ ♦ ధర్మరాజు
జనకుని మొదలయే ♦ ఘనతరంబని యెంచి,
రామచంద్రుడు కీర్తి ♦ రామబడసె
సర్వసల్లక్షణ ♦ సంశోభితుండైన,
నిషధేశ్వరుడొందె ♦ నిత్యయశము

గీ॥ ఇట్టిపూజ్యుల యాదర్శ ♦ మెల్లవేళ
బట్టిచనుడాత్మ సామ్రాజ్య ♦ పదవిగల్గు
కీర్తితారలు దినకర ♦ స్ఫూర్తిదనరు
మహిని గనవచ్చు వైకుంఠ ♦ మందిరంబు॥ 15

# ఈశ్వరస్తుతి.

సీ॥ మడిమాన్యముల నిన్ను ♦ నడుగుకొందామన్న
నిలువనీడే లేదు ♦ నీకుజూడ,
ధనధాన్యముల నిన్ను ♦ దానమడుగుదమన్న
తిరిపెమెత్తుక, నీవె ♦ దిరుగుచుందు,
కట్టబట్టైన, నిన్ ♦ బట్టె యడుగుదమన్న,
కౌపీన మొక్కటే ♦ గలదు నీకు
నీతోడ భాషింప ♦ నినుజేరుదమటన్న,
ముక్కుమూసుక, చేష్ట ♦ దక్కియుంగు,

గీ॥ వింక, నడుగంగ, నీయొద్ద ♦ నేమిగలదు ?
భూషగానీవు దాల్చు, వి ♦ భూతితప్ప
పరగ నీచేతగల, భిక్షు ♦ పాత్రతప్ప
పాపవిధ్వంస, పరమేశ, ♦ పార్వతీశ॥

సీ॥ ఉండకొంపా, నీకు ♦ పండమంచంబ!, యూ
ళ్ళోన, నీభిక్షు, గు ♦ ళ్ళోన, నిద్ర
కట్ట బట్టానీకు ♦ కప్పుకో దుప్పటా?
బూచితోలూ, పాత ♦ గోచెగాని
వేషలా, భాషలా ♦ భూషలా నీకింక
దోషాకరుల్ ఫణుల్ ♦ భూషకార!

మీఁదన్ కరంబెత్తి, దో॥ బుసులాడన్ జిరునవ్వు నవ్వ
గను, చే ♦ బూనంగ నన్నింటిదిన్॥ వెసనేర్వంగనయారె !
నీమహిమ, నీ ప్రేమంబె ! మాహేశ్వరా॥ 2

# పసిపాపసుస్తీ.

## మహేశ్వరీస్తుతి.

ఉ॥ మూఁడుదినంబులాయె సుత ♦ మూసినకంటిని దెర్వదాయె!
యీ॥ పాడుజ్వరంబుచేత గడు♦బాధలమున్గుచు దేలుచుండె
దా॥ నాడగ నాల్గురోజులయె ♦ నాడగ జేయుము వేగిరంబు
నన్॥ వేడుచునుంటినిన్ మదిని ♦ వేగరుణింపుము శ్రీమ
హేశ్వరీ॥ 1

ఉ॥ "ఆయీ" యటంచు నన్నుగని ♦ యారటజెందుచు నేడ్చు
చుండ నే। బాయగజేయకుంటి నిక♦బాధనుమాన్పి సుఖింప
జేయ నీ। వేయని నమ్మియుంటి సుత♦వేదనమాన్పగ జేయు
మంటి, నే। జేయగ లేనికేదియును ♦ జేసెడి దీవెగ!
శ్రీమహేశ్వరీ॥ 2

ఉ॥ నాపసిపాప, నాతనయ♦నాసుకుమారి యనుంగుకూన, యే
పాపమెఱుంగదమ్మ! జ్వర ♦ బాధభరింపగ లేదుసుమ్మ, నిన్

ప్రాపుగ వేడితమ్మ, నను ♦ ప్రాకట భక్తిని గావుమమ్మ, నా
యాపదమాన్పుమమ్మ, జగ ♦ దంబ! మదంబ, యుమా
మహేశ్వరీ॥ 3

ఉ॥ "అన్నము, పున్నమే" నెఱుగ ♦ సంతయు భారమునీ వెయుం
టిని నా। కన్నియ బాధమాన్పి, యిక ♦ కంజదళేక్షణా! బ్రోవు
మాంటి నా। పున్నపుపంటవై మెఱయు ♦ పుత్రడిబొమ్మ!
వరాలతల్లి! యే। పున్నెముఱుంగదీ యబల ♦ బ్రోవుమ,
వేగమె, శ్రీమహేశ్వరీ॥ 4

శా॥ ఆపద్బాంధవి నీవటంచు మదిలో ♦ సత్యాంతమోదంబుతో
నేపట్లన్ నినుదల్చుచుంటినుగదా! ♦ యెట్లోమనంతోన
నున్। ఈపట్టీవిధి వేదనంబడగ నెం ♦ తే బాధయయ్యెన్
జుమీ। నాపాపన్ వడిగావుమమ్మ దయతో ♦ నాతల్లి
మాహేశ్వరీ॥ 5

# మాహేశ్వరీ - కరుణ.

ఉ॥ పాలనజేయుమాత! పసి ♦ పాపలపాలిట పారిజాత మా
"బాలను గావుమమ్మ" యని ♦ భక్తిని వేడగగాచినావు నా
యేలికవీ వెసుమ్మ నిను ♦ నేమరకన్ భజియింతునమ్మ నా
బాలకు బూర్ణసౌఖ్యమిడు ♦ భారమునీయదె! శ్రీమహేశ్వరీ॥